Regd. No. H.N.L. 18



శీనయ్య మృతదేహం: విషణ్ణ వదనాలతో కుమారుడు రాజేంద్ర, మేనల్లుడు చంద్రమోహన్ రెడ్డి

## కన్నీటివరదతో కోట మునిగిపోయింది!

# చెమ్మగిలని నయనమ్ము లేదు

నాయకుడు మరణిస్తే అనుచరులు బాధపడవచ్చు; అభిమానులలో ఆవేదన కలుగవచ్చు. కాని, ఇంటి పెద్ద కన్నుమూసి నట్లు, తోబుట్టువును పోగొట్టుకున్నట్లు, కన్నబిడ్డను దూరం చేసుకున్నట్లు, ఆత్మబంధువు కాలధర్మం చెందినట్లు, సర్వం కోల్పోయినట్లు, లోకమే శూన్యమైనట్లు... గుండెలు బాదుకుంటూ విలపించేవారు, దిక్కులు పిక్కటిల్లే రోదించేవారు, కంటికి మంటికి ఏకధారగా కన్నీరు కార్చేవారు, పొగిలి పొగిలి ఏడ్చేవారు, కాలయముడ్ని శాపనార్థాలు పెట్టేవారు.... ఆడా మగా అన్న తేడా లేదు, పిల్ల పెద్ద అన్న వ్యత్యాసం లేదు, రైతు, కూలి తారతమ్యం లేదు, పెద్ద రెడ్డి గారు, పాలేరన్న విచక్షణ లేదు...

నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి నిజంగా ధన్యజీవి.. పుణ్యజీవి... చిరంజీవి!

శోక సముద్రము, దుఃఖ సాగరము వంటి పదాలకు ఆ రోజు కోట అనే వూరే నిర్వచనంగా కన్పడింది. 23 తేది సాయంత్రమే శ్రీనివాసులు రెడ్డి మరణ వార్త కోటకు చేరింది. ఆ ప్రక్క క్షణమే పల్లె పల్లెకూ ప్రాకి పోయింది. విన్న వారు విన్నట్లే నిలబడి పోయారు. అందరిలోనూ గొంతుకేదో అడ్డం పడిన భావన. కాలం ఘనీభవించిన అనుభూతి! హైదరాబాదుకు కోటకు చాలా దూరమని తెలుసు. అక్కడి మృతదేహం ఇక్కడకు రావడానికి ఎన్నో కొన్ని గంటలు పట్టక తప్పదనీ తెలుసు. కాని చుట్టు ప్రక్క పల్లెల్లో ఎవరికీ కాలు నిలువలేదు. ఎడ్ల బండ్లు, ట్రాక్టర్లు, సైకిళ్లు, కాలి నడక.. ఎటు తోస్తే అటు కదలి వచ్చారు. కోట పై విరుచుక పడ్డారు. రాత్రంతా ఎదురుచూశారు. కంట నీరు ఎండి పోయిన దాకా ఏడ్చారు. 24 తేది మధ్యాహ్నం 11.15 కి గాని కోటకు చేరలేదు మృతదేహం. అప్పటికి కోటలో కాలు కదపను సందు లేదు. గూడూరు నుంచి, నెల్లూరు నుంచి, నాయుడుపేట నుంచి, సూళ్లూరుపేట నుంచి ఎన్ని వాహనాలు కదలి వచ్చాయో! బస్సుల్లో కిటకిట; టాప్ పైన కూడా జనమే. పైన చెట్లు తగులుతున్నా, క్రిందకు జారిపోయేలా వున్నా లెక్క చేయలేదు. అణచుకోలేని ఆవేదన, ఆవేశంగా రూపాంతరం చెంది జనాన్ని వరదలా రప్పించింది!

ఒక్కరి ముఖాన నెత్తురు చుక్క లేదు; అందరి కళ్లలోనూ తడి, గుండెల్లో బరువు. శవాన్ని చూడగానే ఆడవాళ్లు ఆపుకోలేక పోయారు. ఎవరాపినా ఆగకుండా ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లారు. అంబులెన్స్ నుంచి దించి, ఇంట్లోకి తరలించడం అసాధ్యమై పోయింది. పదిహేను నిముషాలు కూడా కుటుంబీకుల సమక్షంలో వుంచనివ్వలేదు జనం. ఇంటి ఎదురుగా షామియానా వేసి, రోడ్డునే పరుండబెట్టారు. అంతిమ దర్శనం కోసం ఆడా, మగకు వేరు వేరు క్యూలు. మధ్యాహ్నమయ్యే సరికి బారులు తీరిన జనాన్ని అదుపు చేయడం అతి కష్టమై పోయింది. దగ్గరకు రాగానే ఎందరో కుప్పకూలి పోయారు. కోటలో ఆ రోజు ఎవరింట్లోనూ పొయ్యిలో పిల్లి లేవలేదు. ఎవరి గొంతులోనూ పచ్చి మంచినీళ్లు దిగలేదు. అంగళ్లు, గింగళ్లు సర్వం బంద్. వూరికి వూరే స్మశానంగా మారిపోయింది. సాయంత్రం వరకు ఏ వీధిలో చూసినా ఏడ్పుల ధ్వనులే; ఇంటింటి ముందు శీనయ్య ఫోటో పెట్టి పూలదండ వేశారు. భగవద్గీత శ్లోకాలు,

కొరవ 8 పేజీలో

26.-2-1993 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 64 సంచిక :9 విడిప్రతి : రు. 2.00 లు

జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



"సెలవు"



జనసముద్రం పై తెప్పలా తేలి పోతున్న నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి అంతిమ యాత్రా శకటం

## మూడు దశాబ్దాల పాటు రాజకీయ, అధికార రంగాల్లో అవిశ్రాంతంగా ప్రతిధ్వనించిన

# శీనయ్య వాణి మూగబోయింది!

శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి దివాకరు - పోరాటమే ఊపిరిగా, 20 ఏళ్ల పాటు ఎత్తిన కత్తి దించకుండా రాజకీయ రంగంలో స్వైర విహారం చేసిన శీనయ్య చివరకు 36 రోజుల భీకర సమరానంతరం మృత్యువుతో ఓడిపోయారు-

మూడు దశాబ్దాల పాటు రాజకీయ అధికార రంగాల్లో అవిశ్రాంతంగా ప్రతిధ్వనించిన శీనయ్య వాణి మూగ బోయింది-

విషయం ఎంత చిన్నదైనా, పరిధి ఎంత పెద్దదైనా శ్రమను లెక్క చేయకుండా వ్రాసిన ఆ చెయ్యి చైతన్య రహితమై పోయింది-

ఎంత దూరమైనా ఎంత ప్రయాసైనా నిరాహారాలు మాని పర్యటించిన సుకుమార సుందరరూపి శీనయ్య శవమై పోయారు -

వివాదాస్పదుడుగానే, విరోధులను పెంచుకుంటూనే రాష్ట్ర రాజకీయాలలో ఒక తారగా ప్రకాశించిన శీనయ్య కనుమరుగై పోయారు-

తాను పరమ పవిత్రంగా భావించి ఇప్పటి వరకు కాపాడుక వస్తున్న శాసనసభ హోదా వ్రతం చివరన భంగమైనందుకు మూగ క్షోభ ననుభవించిన శీనయ్య కన్ను మూశారు-

తనను కోట శీనయ్యగానే చూడమని, పిలవమని తన అభిమాన లోకాన్ని తొలిసారి మంత్రి అయినప్పుడు జిల్లా మొదటి పర్యటనలో కోరిన ఆ నిరాడంబరుడు విగతజీవి అయిపోయారు-

ఇక శీనయ్య కనపడరు, వినబడరు - 23 తేది సాయంత్రం 4.55 గంటలకు ఆయన తుదిశ్వాస విడిచారు. విరోధుల కండ్లు గూడా సజలం చేసి తన దారిన తాను పోయారు!

శ్రీనివాసులు రెడ్డి పుట్టు రాజకీయవాది. అంటే పుట్టినప్పటి నుండి అని కాదు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రంలో పట్టా పొంది విశాఖ నుండి ఇంటికి తిరిగి వచ్చి రాగానే అతని పై కోట సమితి అధ్యక్ష బాధ్యత పడింది. సమితి

కొరవ 11 పేజీలో

### "సమితి అధ్యక్షుడుగా ఆదర్శప్రాయుడు!"

1962 మే 14 వ సమితి ప్రెసిడెంటు అయిన వెంటనే సమితి ముఖ్య అధికారులను వెంటబెట్టుకొని సమితిలోని గ్రామాలన్నీ తిరిగి, ఆయా గ్రామాల అవసరాలేమిటో విచారించి, స్వయంగా పరిశీలించి, ఎస్టిమేట్లు తయారు చేయించి, క్రోడీకరించి, పట్టిక తయారు చేసి ఒక సమగ్ర సమితి అభివృద్ధి ప్రణాళికను తయారు చేశారు. సమితికి నిధులు కేటాయించగనే మళ్లీ గ్రామాలకు వెళ్లి ఎస్టిమేట్లు వగైరాలు జరిపించనక్కర లేకుండానే వెంట వెంటనే ఆయా పథకాలకు నిధులను మంజూరు చేసి విలువను, వేగాన్ని సాధించ గల్గారు. ఒక రకంగా ఈ పద్ధతి



విప్లవాత్మకమైనది. పల్లెల నుండి ప్రణాళికా రచన జరగాలని, ప్రణాళికలకు సార్థకతను కలిగించాలనే సిద్ధాంతానికి జీవం కల్పించారన్నమాట. ఈ పద్ధతి వెనుక వున్న పరిపాలనా సౌలభ్యాన్ని గుర్తించినవారు గనకనే అప్పటి కలెక్టరు శ్రీ ఎం.వి. రాజ గోపాల్ దీనిని శ్లాఘిస్తూ, ఈ విధానాన్ని ఆదర్శంగా అనుసరిస్తే బాగుంటుందని ప్రతి సమితి అధ్యక్షునికి సర్క్యులర్ పంపారు.

(10-4-1964 తేది జమీన్‌రైతు సంచిక నుండి పునర్ముద్రితం)



కూతలిలో జరిగిన కోట సమితి మేళాలో సమితి అధ్యక్షుడుగా వుపన్యసిస్తున్న శ్రీనివాసులురెడ్డి. వేదిక మీద అప్పటి రెవిన్యూ మంత్రి నూకల రామచంద్రారెడ్డి గారున్నారు.

### ఈసారి ఏమి నిరీక్షిస్తున్నదో!

మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి జెనీవాలో జరిగే ఐక్యరాజ్య సమితి మానవ హక్కుల సమావేశానికి భారత ప్రతినిధి వర్గ నాయకుడుగా 23 తేది ఢిల్లీ నుండి సపత్నీకంగా బయలు దేరి పోయారు. అవకాశము, అవసరము, అదృష్టము కేక వేసి రమ్మని పిలిస్తే తప్ప మార్చి 12 తేది వరకు అక్కడే వుంటారు. ఎన్నో ప్రతినిధి వర్గాలకు, ఎందరో కాంగ్రెస్ వాదులు నాయకులుగా, ఎన్నో అంతర్జాతీయ సభలకు పోతుంటారు. ఆంధ్రప్రదేశ్ నుండి, అందునా నెల్లూరు జిల్లా నుండి ఒక అంతర్జాతీయ వేదిక ఎక్కబోతున్న మొదటి వ్యక్తి జనార్దన రెడ్డి గారేనేమో! జనార్దన రెడ్డి భారత ప్రతినిధి వర్గ నాయకత్వం ముఖ్యమంత్రిత్వం కంటే విలువైనది అని ఒక ఢిల్లీ మిత్రుడు వ్యాఖ్యానించారు. నిజమే మరి!

ఆ విలువలు గిలువల సంగతి ఎట్లున్నా ప్రతి విదేశీ పర్యటనా జనార్దన రెడ్డి రాజకీయ పురోభివృద్ధికి ఎంతో దోహదకారి అవుతున్నది. 1971 కి.శే. నేదురుమల్లి బాలకృష్ణారెడ్డి గారితో కలసి అమెరికా, యూరప్ దేశాలు పర్యటించి వచ్చారు. ఆయన తిరిగి రాక కోసం ఎదురు చూస్తుండినదా అన్నట్లు 1972 లో రాజ్యసభ సభ్యత్వం ఆయన్ను వరించింది. డాక్టర్ చెన్నారెడ్డి మంత్రి వర్గంలో వ్యవసాయ శాఖ మాత్యుడుగా, 1990 జూలై లో ఇంగ్లాండు, అమెరికాలో పర్యటించి తిరిగి వచ్చి రాగానే ఆ డిసెంబరులో మూడు సార్లు చేజారి పోయిన ముఖ్యమంత్రిత్వమే హస్తగత మైంది. ఇప్పుడు మంచి హోదాతోనే జెనివా పోయారు. ఈ సారి ఆయన కోసం ఏ పెద్ద పదవి నిరీక్షిస్తున్నదో ఎవరు చూచి వచ్చారు? ఇరవై ఏళ్ల నుండి వస్తున్న సాంప్రదాయం ఇప్పుడు మాత్రం జరగదని ఎట్లాఅనుకోగలం?

### పినాకిని తీరం

#### చెప్పిన మాట ఏమైంది?

జిల్లా కాంగ్రెస్ కార్యవర్గానికి సంబంధించి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవరెడ్డి చెప్పిన మాట ఏమైంది? ఏమిటి ఆ మాట అంటారా? - కార్యవర్గం అంటూ ఏర్ బస్ పరిమాణంలో ఒకే ఒక తెలుగు దిన పత్రికలో వచ్చిన జాబితా అధికారయుత మైంది కాదని, అందులో మార్పులు చేర్పులు వున్నాయని, అదంతా పూర్తి అయిన తర్వాత లిస్టు విడుదల అన్ని పత్రికలకూ చేస్తానని శ్రీ సంజీవరెడ్డి అనాడు చెప్పారు. దాదాపు నెల అవుతున్నది; అయినా ఖరారు జాబితా రాలేదు. వచ్చే సూచనలు కనపడడం లేదు. అదే తొలి మలి, అసలు సిసలు జాబితా అనుకోవలసి వస్తున్నది;

కొరవ 10 పేజీలో

# జమీన్‌రైతు

## బాపిరాజు రాజీనామా

రాష్ట్ర ఎక్సైజ్ మంత్రి శ్రీ కనుమూరి బాపిరాజు రాజీనామా చేశారు. ఒకే సంతకంతో 21 డిస్టిలరీలు, బ్రూవరీలకు లైసెన్సు లిచ్చిన ఉదంతంలో దోషిగా ముద్రపడి, ప్రక్కకు తప్పుకున్నారు. ఈ సంఘటన వెలుగులోకి వచ్చి, వివాదాస్పదంగా మారినప్పుడో, లేక ముఖ్యమంత్రే స్వయంగా న్యాయ విచారణకు ఆదేశించినప్పుడో రాజీనామా ఇచ్చి వుంటే ఆయన ప్రతిష్ఠనిల్చేది. కాని రాజీనామా చేసే ప్రశ్నలేదని రెండు వారాల పాటు దబాయించి, ప్రతి పక్షాలు, పత్రికల గోల పడలేక, నిలబడే నిబ్బరం లేక ఈ నిర్ణయానికి రావడంతో నైతిక బాధ్యతకు, నిజాయితీకి విలువ లేకుండా పోయింది.పైగా రాజీనామా సమర్పణలోనూ అసహనం, తొందరపాటు, ఉక్రోషం, ఉడుకుమోత్తనం చూపి ప్రజలలో ఎగతాళి పాలైనారు బాపిరాజు.

ఈ ఉత్తర్వుకు సంబంధించి ఆయన చేతులు స్వచ్ఛంగానే వుండి వుండవచ్చు. అవినీతికి పాల్పడి వుండక పోవచ్చు. కాని ఇది ప్రజాస్వామ్యం. ప్రభుత్వంలో వుండే వారి చర్యలను ప్రశ్నించే హక్కు ప్రతి ఒక్కరికీ వుంటుంది. ఆ చర్యలు సక్రమమైనవని, అందులో తాము తప్పు చేయలేదని నిరూపించు కోవలసిన బాధ్యత పాలకులదే. బాపిరాజు కూడా మొదట మంత్రి పదవికి రాజీనామా చేసి, న్యాయ విచారణకు సహకరించి, ఆ నివేదిక వచ్చినంత వరకు వేచి వుండాల్సింది. దానిలోనూ నిందబడితే, శపథం చేసిన ప్రకారం ఎమ్మెల్యే పదవికి రాజీనామా చేయడం పద్ధతిగా వుండేది. తనను నిలదీశారనే ఆగ్రహంతో గన్‌మ్యాన్‌లపైన, పోలీసు కానిస్టేబిళ్ల పైనా విరుచుక పడి, ఆవేశంతో నిర్ణయాలు చేస్తే నష్టం ఎవరికి? తన ఉడుకుమోత్తనం వల్ల రాజీనామా చేసిన విలువ, గౌరవం పొందలేక పోయారు బాపిరాజు. అది ఆయన స్వయం కృతాపరాధం.

తెలుగుదేశం పార్టీ కూడా తెగిందాకా లాగుతున్నది. న్యాయ విచారణఅన్నారు; బాపిరాజు రాజీనామా కోరారు; అవి రెండూ జరగగానే న్యాయమూర్తిని మార్చాలంటున్నారు. అన్నీ ప్రతి పక్షం చెప్పినట్లే చేసే పనైతే ఇక ప్రభుత్వం ఎందుకు? ఎప్పుడో తమ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తీర్పు ఇచ్చారని ఆ న్యాయమూర్తి శీలాన్నే శంకించడమా?

## రైలు ఛార్జీలు

ఆధునికతకు, అభివృద్ధికి రవాణా మార్గాలు, రవాణా సాధనాలు సంకేతాలు. మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రవాణా మార్గాల ఏర్పాటుకు డబ్బు లేదంటాయి; రవాణా సాధనాల పైన మోయలేని బరువు మోపి నిర్వీర్యం చేస్తున్నాయి; మొన్నటికి మొన్నరాష్ట్ర ప్రభుత్వం బస్ ఛార్జీలు పెంచింది; ఇప్పుడు రైల్వే మంత్రి రైల్ ఛార్జీలను భరించ రాకుండా హెచ్చించారు. అదనపు సౌకర్యాలు కల్పించి, అదనపు ఖర్చు పెట్టేటప్పుడు అదనపు రాబడి చూసుకోవాలి. ప్రయాణీకులకు ఏమి సౌకర్యాలు కల్పిస్తున్నారని రైల్వే టిక్కెట్ల ధరలు ఏటేటా పెంచుతున్నారు? ఒక్కసారిగా 1800 కోట్ల భారమంటే ప్రజలు ఏమై పోవాలి! ఈ ధరల పెంపు రైళ్లతో ఆగేది కాదు. వాటి ధర పెరిగితే దేశంలో వాటి ద్వారా రవాణా అయ్యే ప్రతి వస్తువు ధరా పెరిగి తీరుతుంది. బొగ్గు, ఆయిల్, ఇనుము వంటి ముడి పదార్థాలకు రైళ్లే రవాణా సాధనాలు. వాటి వల్ల ఆ ఉత్పత్తుల ధరలూ పెరుగుతాయి. ఇవన్నీ ప్రభుత్వానికి తెలియక కాదు. కాని, లోటు పెరిగి నప్పుడల్లా పూడ్చడానికి ప్రభుత్వానికి కన్పడేది ప్రజల జేబులే!

ఈ సారి వడ్డింపులు మరీ ఎక్కువగా వున్నాయి. సరాసరిన పది శాతం పెంచారు. రైలు కంటే బస్సు ప్రయాణమే చవకగా వుందిప్పుడు. ఏసి తరగతుల్లో తిరిగే ధనవంతుల జేబుల పై భారం అపరిమితం. వంద కిలోమీటర్ల లోపు వుండే ప్యాసింజర్ ప్రయాణాలకు మార్పు చేయక పోవడం ఒక రకంగా అదృష్టం. ఈసారి బడ్జెట్‌లో కల్లా మనం సంతోషించాల్సింది – మద్రాసు ఢిల్లీల మధ్య రాజధాని ఎక్స్‌ప్రెస్ ప్రవేశం. ఎన్నో సంవత్సరాల కోరిక ఇది. సెకండ్ క్లాస్ స్లీపర్ అని ఒక కొత్త తరగతి ప్రారంభించారు. అది త్రీ టయిర్ బెర్త్‌ల కంటే ఎట్లా మెరుగ్గా వుంటుందో వేచి చూడాలి! ఆంధ్రకు సంబంధించి ఈ బడ్జెట్‌లో విశేషమేదీ లేదు. కొత్త లైన్ల ఏర్పాటు ప్రస్తావనే లేదు.

రైల్వేలకు అన్ని ప్రధాన నగరాలలో కొన్ని వేల కోట్ల విలువ చేసే స్థలాలున్నాయి. వాటిలో సగ భాగం ఖాళీగా పడి వున్నాయి. ఆ స్థలాలను వాణిజ్య పరంగా వినియోగించి రైల్వేల ఆదాయం పెంచి ఆధునీకరణ చేపట్టాలన్న ప్రతిపాదన వుంది. ఎందువల్లనో జాఫర్ షరీఫ్ దాన్ని విస్మరించారు. అటువంటి మార్గాంతరాలు ప్రజల పై భారం తగ్గిస్తాయి కదా? కేటరింగు, టిక్కెట్ల రిజర్వేషన్ వంటి విభాగాలను ప్రైవేటు పరం చేయాలనే ఆలోచననూ పట్టించు కోలేదు. రైళ్లలో తిండి తినడమంటే ఆస్పత్రిలో పడక రిజర్వు చేసుకోవడంగా వుందిప్పుడు. ప్రభుత్వ పరంగా దాన్ని మెరుగు చేయలేని పరిస్థితులలో ప్రైవేటు వ్యక్తులకు అప్పచెబితే తప్పేమి?

# జమీన్‌రైతు

26.2.1943

4 పేజీలు 0-1-0

## నెల్లూరు ముచ్చట్లు

### అరెస్టులు

తిక్కవరపు రామిరెడ్డి గారి 4 వ పుత్రిక శకుంతలాదేవి గారు మద్రాసులో 18 తేది అరెస్టు అయిరి. 19 తేది విచారించి 6 మాసాలు శిక్ష విధించిరి. 3 వ పుత్రిక అనసూయాదేవి చెల్లెలి విచారణకు మద్రాసుకు పోయి వుండి కోర్టులో జాతీయ నినాదాలు పలికినందుకు అరెస్టుగాబడి ఆమెకు 20 తేది 3 మాసాలు శిక్ష విధింపబడెను.

పొట్టెంపాడు మోపూరు ముద్దు కృష్ణారెడ్డి గారి ద్వితీయ పుత్రుడు రాఘవరెడ్డి గారు 23 తేది మదరాసు ప్రధాన మేజిస్ట్రేటు కోర్టులో జాతీయ నినాదాలు పలికినందుకు అరెస్టు చేయబడి అప్పుడే విచారించబడి 3 మాసాలు శిక్ష విధించబడెను.

నెల్లూరులో 9 తేదిన అరెస్టు కాబడిన కొనగళ్ల శేషాచలం శెట్టి గారి వాయిదా 3 తేదిన.

### గాంధీ ఉపవాసం

నెల్లూరు జిల్లాలో 21 తేది ప్రార్థనా దినంగాను, 24 తేది ఉపవాస దినంగాను నిర్ణయించారు. విద్యార్థులంతా 21 తేది చాలా మంది ఉపవాసాలున్నారు. కొన్ని దుకాణాలు మాత్రం మూయబడినవి.

24 తేది టవునంతా సంపూర్ణంగా హర్తాళ్ జరిగింది. వి.ఆర్. హై స్కూలు విద్యార్థులంతా సమ్మె జేశారు. ఉదయాన్నే కాంగ్రెసు సేవకులు, విద్యార్థులు పినాకినికి వెళ్లి స్నానాలు జేసి ఉపవాస వ్రతం ప్రారంభించారు. ఈ దినం టవునులో

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

5,6 మంది ఉపవాసం ఉండి ప్రార్థనలు జరిపారు.

అల్లూరు, చినచెరుకూరు, వెంకటగిరి, కావలి, కోవూరు మున్నగు ప్రదేశాల్లో గూడా సంపూర్ణ హర్తాళ్ - ఉపవాస ప్రార్థనాది కార్యక్రమాలు సాగినట్లు వార్తలొస్తున్నవి. ఈ జిల్లా నుండి అనేక టెలిగ్రాములు గూడా వైస్ రాయికి పంపబడెను.

నెల్లూరు టవున్‌లో స్త్రీలకంతా 28 తేది ఆదివారం ఉపవాస ప్రార్థనా దినంగా నిర్ణయించారు. పొణకా కనకమ్మ గారు ఆ కృషికి పూనుకున్నారు.

### నళీయం

...నళపాకము జేసిన సైన అందు యిం పొదవి ఉప్పులేక రుచిబుట్టగ నేర్చునటయ్య''

అన్నాడు భాస్కరుడు. అట్లానే సమిష్టి మీద రక్తిగట్టలేదు నాటకం. ఇక వ్యక్తిరీత్యా చూద్దాం.

నలుడు గోట శ్రీనివాసరావు గారు వేషం ఎట్లావున్నా తగ్గుస్థాయిలో పాడితే ఉత్తరాదిని తలదన్ను గలధ్వనిస్తుంది.

దమయంతి బుష్యేంద్రమణి: ఆంధ్ర నాట్య కళారంగంలో యింత మాత్రం తెలివి గలిగి నటించ ప్రజ్ఞావతి ఉన్నందుకు నిజంగా గర్వించాలె. మంచి శ్రావ్యమైన గానం, ఏం చెయ్యాలో తెలిసి నటించగల ప్రజ్ఞాకౌశలం, ఇవి రెండే చాలు ఆమెను ముందుకు నెట్టడానికి. ప్రథమ భాగంలో బాగుంది. చివరి భాగంలో అసలు పద్యాలు ఎగురగొట్టి స్వంతపాటలు వేసుకున్నందునను, తోడి నటకుల అలౌకికత వల్లను రుచి తగ్గింది.

అగ్గంకి: ఆయనకున్న పేరంతా నాశనమై పోయింది. ఛీ! ఛీ!! మన రాయప్రోలు 10 కోట్ల రెట్లు మేలుగా వుండేది.

మన చెంచు బాగానే నటించాడు. నాడు రాణించిన వారిలో నేలనూతల రామకృష్ణయ్య గారిది అగ్రతాంబూలం. ఇక వివరాలకు ప్రొద్దులేదు కలవు.

కొరవ 10 పేజీలో

# మానవ కళ్యాణానికి మార్గం వెతకాలి!

డిశంబరు 6 తేది అయోధ్య సంఘటనకు, ఏ కొద్ది మందో తప్ప, భారత మాతే కన్నీరు కార్చిందనటంలో సందేహం లేదు. అనాగరికత, నాగరికతగా పరిగణింపబడే యీ రోజుల్లో యిట్టి సంఘటనలతో యితర దేశాలతో పోల్చి చూస్తే మన దేశమెంతో మెరుగు. (మతాతీత లౌకిక వ్యవస్థతో తోటి సోదరులకు మన రాజ్యాంగం కల్పించే సదుపాయాలను ఇస్లాం వ్యవస్థ రాజ్యాలలో, అల్ప సంఖ్యాకులే యెదురు చూడక పోగా, ముస్లింలలోని అల్ప తెగలు కొన్ని యిందుకు నోచుకోలేరని పత్రికలలో చూస్తుంటాము గదా!) ఇవి కూడా మన క్షుద్రరాజకీయాల వల్లనే ఏర్పడుతున్నాయి. ఎవడో ఒక సిక్కు ఇందిరాగాంధీని బలి గొన్నాడని యెందరో అమాయకపు సిక్కులు హతం గాబడ్డారు. యెవడో ఎల్.టి.టి.ఇ. తెగవాడు రాజీవ్ గాంధీని పొట్టనబెట్టుకొన్నాడని దేశంలోని పలు ప్రాంతాలలోని తమిళులు నష్టాలకు గురైనారు. అయోధ్య సంఘటనలకు నిరసనగా పొరుగు దేశాలలోని మనవారు కష్టనష్టాలకు గురి కావడమే కాకుండా అవమానాల పాలైనారు. ఇటువంటి దుశ్చర్యలు మన మనస్సులకు ఇంకా దూరం కాలేదు.

ఏనాడో బాబరు, ఔరంగజేబు లాంటి వారు జేశారన్న పాప కార్యాలకు బలిగా, ఒకే కుటుంబంలోని సోదరులం యిప్పుడు ఇంత మృగప్రాయంగా ప్రవర్తించడానికి యీనాటి రాజకీయ దుష్టశక్తులే బాధ్యత వెరపాలి.

ఏదో అన్నలు (అధిక సంఖ్యాకులు) ప్రేమగా అడుగుతున్నారని తమ్ముళ్లు (అల్పసంఖ్యాకులు) ఒప్పుకొని వున్నా లేక తమ్ముళ్ల కోర్కెను మన్నిద్దాంలే అని అన్నలు పెద్ద మనస్సు చేసుకొని వున్నా, దేనికి కొరగాని యీ అయోధ్య విషయం రాజకీయంగా గాకుండా స్థానికులకే వదలేసి వుంటే, మతాతీతమైన మన భరత మాత వ్యవస్థ యితరుల దృష్టిలో

## జనవాణి

ముఖ్యంగా ముస్లిం రాజ్యాలలో యింత తలవొంపులయ్యేది.

ఏదైనా ఆవేశానికి గాని, ఆనందానికి గాని హద్దులు మీరినప్పుడు అన్నీ అనర్థాలే జరిగే యీనాటి వ్యవస్థలలో, యేదో కొన్ని దుష్టశక్తుల వల్ల, మానవ జాతే సుఖాలకు దూరం గావడం శోచనీయం. యిటువంటి సంఘటనలు వార్తలలో చూడడం తప్ప నాగరికులు వీటికెప్పుడు దూరంగానే వుంటారు.

మన జిల్లాలో జరిగే రొట్టెల పండుగ, కనుమూరు మస్తానయ్య పుర్సు, నాగూరు(తమిళనాడు) లో జరిగే దర్గా పండుగల వంటి వాటిల్లో ముస్లింల కన్నా, అన్నలే (అధిక సంఖ్యాకులనబడే హిందువులు) యెక్కువగా పాల్గొనడం వంటి విషయాలు వార్తా పత్రికలతో పాటు రేడియో దూరదర్శన్ వంటి ప్రచార సాధనాల ద్వారా యెక్కువ ప్రచారం చేస్తే అన్ని వర్గాలలో సోదర భావాన్ని పెంపొందించగలవు.

కొరవ 8 పేజీలో

# సణుగుడు

* దివిజ నేతల గుండెలు ధిగ్గురన...

* పెలిఫోన్లా? మైక్రోఫోన్లా?

దివిజ నేతల గుండెలు ధిగ్గురన - శ్రీనివాసులు రెడ్డి అరుగుచున్నారమర పురికి! అరుగుతుందదమేమిటి, ఈ పాటికి చేరి పోయి వుంటారు. అప్సరలు, అభిమానులు, అనుచరులు కంటికి మింటికి ఏకధారగా ఏడ్వగా ఏర్పడిన కన్నీటి నదిపైన, విలాపాల పడవ ఎక్కి స్వర్గలోకానికి చేరిపోయి వుంటారు. శ్రీనివాసులు రెడ్డి రాక సురాధిపతుల గుండెల్లో పడిన రాయి క్రిందే లెక్క. ఎదురులేని రారాజుగా వెలుగొందే ఇంద్రుడు ఇక నుంచి శ్రీనివాసులురెడ్డి పాయింట్ ఆఫ్ ఆర్డర్లకు జవాబు చెప్పలేక సభా మందిరం వైపే కన్నెత్తి చూడడు! వర్లంతా కళ్లన్నీ ఆ వికృతాకారుడి వైపు. శ్రీనివాసులు రెడ్డి స్వరూపం గమనించిన రంభ తిలోత్తమాదులూ కన్నెత్తి చూస్తారని నేననుకోను. తరాల తరబడి సోమరి పోతుల వలె కాలం గడుపుతున్న దిక్పాలకులు శినయ్య శేఖాస్త్రాల ధాటికి తాళలేక ఇక నుంచి సకాలంలో వానలు కురిపించి, గాలి వీయించడంలో ఈ పాటికి నిమగ్నమయ్యే వుంటారు. స్వర్గలోకపు వాకిట ఆయనకు ఖచ్చితంగా ఘనస్వాగతమే లభించి వుంటుంది – ఇంద్రుడి అరాచకాలకు విసిగి పోయిన ఆ లోకపు వాసులంతా నిలదీసే వాడు ఒకడొచ్చాడనే సంబరంతో, కేరింతలతో స్వాగతించి వుంటారు.

ఇక్కడ లోపించిన నాయకత్వాన్ని ఆయన తీరుస్తారు; మరి ఇక్కడ ఆయనలేని లోపాన్ని ఎవరు పూరుస్తారు? ఎవరికి సాధ్యమది? రాజకీయంగా శ్రీనివాసులు రెడ్డికి అసంఖ్యాకమైన విరోధులుండవచ్చు; ఆయన పద్ధతులు నచ్చని వారు కోకొల్లలుగా వుండవచ్చు. కాని శ్రీనివాసులు రెడ్డి నాయకత్వ శైలిని, వాగ్ధాటిని, ఉపన్యాస నైపుణ్యాన్ని, 'ప్రజా సేవా తత్పరతను అభిమానించని వారుండరు. శ్రీనివాసులురెడ్డి అనేవాడే లేకుంటే కోట పేరు ప్రపంచానికి తెలిసేదా? సముద్ర తీరంలోని ఆ గ్రామాలు ఇప్పటి వలె వుండేవా? జన సంచారమే వుండని కుగ్రామాల డొంక రోడ్లు సైతం తారు రోడ్లుగా మారేవా? పట్టుమని పాతిక ఇళ్లు కూడా వుండని పల్లెపు పాళెలకు కూడా ఉప్పు కాలువ పై వంతెనలు సమకూరేవా? అన్ని స్కూళ్లు, హాస్పిటళ్లు, పశువైద్యశాలలు, రక్షిత మంచి నీటి పథకాలు ఎన్ని యుగాలు తపస్సు చేస్తే వాటికి లభించి వుండేవి? జిల్లా మొత్తం మీద ఎన్ని ఇళ్ల కాలనీలున్నాయో, కోట చుట్టు ప్రక్క గ్రామాలలో అన్ని వున్నా — అవంతా శినయ్య పుణ్యమే. కోర్టులు, ట్రెజరీ కార్యాలయాలు, రిజిస్ట్రేషన్ ఆఫీసులు, పిడబ్ల్యుడి విభాగాలు... ప్రభుత్వంలోని ప్రతి శాఖకూ కోటలో కార్యాలయం వుందంటే అదీ శినయ్య పుణ్యమే.


అపోలో అధినేత డాక్టర్ పిసిరెడ్డి షష్టి పూర్తి సందర్భంగా నూతన వస్త్రాలతో సత్కరిస్తున్న జనార్ధన రెడ్డి దంపతులు

ఈ పాతిక, ముప్పయ్యేళ్లలో తాసిల్దారు నుంచి ప్రధాన మంత్రి వరకు కోటకు సంబంధించిన పనుల కోసం శ్రీనివాసులు రెడ్డి వ్రాసిన జాబులు, పంపిన విజ్ఞప్తులు ఎవరైనా లెక్క పెట్టగల్గితే గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డుల్లో ఆయన పేరు ఖచ్చితంగా నమోదౌతుంది! జిల్లాలో మంత్రిగా, ఎమ్మెల్యేగా ఆయన వేసిన పునాది రాళ్లు, ప్రారంభోత్సవ ఫలకాలూ వేల సంఖ్యలో వుంటాయి. ఆయన కంత రాళ్ల పిచ్చి. జిల్లా ప్రజల మానసాల పై స్వర్గీయ ఎ.సి. పేరెట్లా చెరిపినా చెరగని శిలాశాసనంగా నిల్చిపోయిందో, కోట వాసుల హృదయ ఫలకంపై శినయ్య పేరట్లా తరతరాలు నిల్చిపోతుంది!

డోలేంద్ర

శ్రీనివాసులు రెడ్డి ప్రెస్ కాన్ఫరెన్సులు ఎంత లైవ్లీగా వుండేవో! ఎంత రెచ్చగొట్టినా, గిల్లి కజ్జాలు పెట్టుకొనే ప్రశ్నలు వేసినా, కావాలని అడుగుతున్నామని తెలిసినా సహనం కోల్పోయేవాడు కాదు. ముఖం కందగడ్డగా మారిపోయేది కాని, మాట మాత్రం నవ్వుతో కలగలిసే వచ్చేది! ఎన్ని సందర్భాలలోనో పుండు మీద కారం చల్లినట్లు ప్రశ్నలు వేసివుంటాను; కాని ఎప్పుడు, ఎక్కడ కన్పడినా ఆప్యాయంగా పలుకరించడం తప్ప, విలసట లాడింది లేదు! రాజకీయపు పోకడలకు, వ్యక్తిగత సంబంధాలకు స్పష్టమైన తేడా పాటించడం అందరికీ చేతకాదు; అంతటి హృదయ వైశాల్యం కొందరిలో కాని వుండదు. శ్రీనివాసులు రెడ్డి బ్రతికున్నంత కాలం తిట్టిన వాడు కూడా, చనిపోయిన తర్వాత తమకు తెలియకుండానే తమ కంట తడి పెట్టడానికి అదే కారణం.

శ్రీనివాసులురెడ్డి కుటుంబీకులు ప్రజా సమస్యల పైన ఆయన వ్రాసిన జాబులు, అసెంబ్లీలో వేసిన ప్రశ్నలు, హాజరైన శంకుస్థాపనాది కార్యక్రమాలు, నెరవేర్చిన పనులు తదితరాల పై ఒక సమగ్ర పుస్తకం ప్రచురిస్తే భావితరం రాజకీయ వాదులకు అదొక కరదీపికగా వుపకరిస్తుంది! శ్రీనివాసులు రెడ్డి పేరుతో కోటలో ఒక రాజకీయ శిక్షణా పాఠశాల నెలకొల్పడమూ సముచితం. ప్రజా ప్రతినిధికి - ప్రజలకు వుండవలసిన సంబంధాలు, అసెంబ్లీ, పార్లమెంటులలో సభ్యులు ప్రవర్తించాల్సిన తీరు, ఉపన్యాస నైపుణ్యం వంటి వాటిపై శిక్షణ నిచ్చే సంస్థగా దాన్ని తీర్చిదిద్దాలి!

బ్రతికినంత కాలం విరోధించినా శినయ్య ఇకలేడంటే మనసు శూన్యంగా మారుతూంది! ఎంత ఘాటుగా తిడుతూ వ్రాసినా, ఎన్ని ఆరోపణలు చేసినా, ఎంత పరుష పదజాలం వాడినా నవ్వుతూ స్వీకరించే నాయకుడు ఇంకెవరున్నారు?

* * *

కొరవ 10 పేజిలో

# పిడతాపోలూరు హత్యకేసులో 13 మందికి జీవిత ఖైదు

ముత్తుకూరు మండలం పిడతాపోలూరు గ్రామ సర్పంచ్ పోతిరెడ్డి కోదండ రామరెడ్డి హత్య కేసులో 13 మంది నిందితులకు యావజ్జీవ ఖైదు శిక్ష విధిస్తూ నెల్లూరు అడిషనల్ జిల్లా జడ్జి శ్రీ ఎస్.సూర్యనారాయణ సంచలనాత్మక తీర్పు చెప్పారు.

కోదండరామ రెడ్డి 1981 లో పిడతాపోలూరు సర్పంచ్ గా ఎన్నికైనారు. అతనికి, మాజీ సర్పంచ్ నాగా రెడ్డి నరసారెడ్డికి విభేదాలొచ్చాయి. పంచాయితీ రికార్డుల నుంచి, దేవాలయ భూముల వరకు పలు విషయాలలో కోర్టు కేసులు కూడా నడిచాయి. నరసారెడ్డి ఇరవయ్యేళ్ళకు పైగా ఆ గ్రామ సర్పంచ్ గా పని చేసిన వాడు. అతని వర్గానికి చెందిన ఒక రౌడీ ఆ గ్రామం లోని పూజారి కూతుళ్ళ పై అత్యాచారం చేశాడు. అత్యంత దారుణమైన సంఘటన అది. వారు పేద బ్రాహ్మణులు, ఎవరి మద్దతు లేదు. స్వతహాగా రౌడీలతో ఎదిరించి పోరాడే శక్తి లేదు- వారిపై అమానుషంగా ఇంట్లో జొరబడి వేధించి, అత్యాచారం జరిపిన ఆ నీచుడ్ని కోదండరామ రెడ్డి ఎదిరించారు. పోలీసు కేసు పెట్టించారు. ఈ సంఘటనలన్నీ ఆ యువకుడి హత్యకు దారి తీశాయి.

1989 మార్చి 25 తేది రాత్రి 10గంటలప్పుడు కోదండరామ రెడ్డి పొరుగు గ్రామమైన మునునూరు వారి పాళెం సర్పంచ్ ఎం.రవికుమార్ రెడ్డి తో కలసి మోటార్ సైకిల్ పై వెళ్తున్నప్పుడు, పిడతాపోలూరు రోడ్డు లో, ఊరికి దూరంగా ఆపి ప్రక్కనే వున్న పొలాల్లోకి పడద్రోసి, కిరాతకంగా మెడ నరికి చంపారు. ఆ దృశ్యం పరమ భయంకరంగా వుండింది. దీనిపై దాదాపు నాలుగు సంవత్సరాలు కేసు నడిచింది.మొత్తం 19 మంది పై నేరారోపణ చేశారు. వీరిలో ప్రధాన ప్రత్యర్థి నాగారెడ్డి నరసారెడ్డి తో సహా 13మంది దోషులని భావించి, న్యాయమూర్తి వారికి జీవితఖైదు విధించారు. శిక్ష పడిన వారు వీరు-నాగారెడ్డి నరసారెడ్డి, కట్టా శ్రీధర్ రెడ్డి, జొన్నలగడ్డ సుందరయ్య నాయుడు, వెంకట సుబ్బయ్య నాయుడు, వెంకయ్య నాయుడు, శ్రీహరి నాయుడు, చిరమన మోషి, చిరమన దయాకర్, చిరమన వెంకయ్య, మోచర్ల రమణయ్య, ప్రసాద్ నాయుడు, బద్వేలు మల్లికార్జున, బద్వేలు వెంకటరత్నం, తక్కిన ఆరుగురు-షేక్ షబ్బీర్, పిడతాపోలూరు వెంకటేశ్వర్లు, నీలి వెంకటేశ్వర్లు, నాగారెడ్డి నాగేంద్ర కుమార్ రెడ్డి, చిరమన కమలాకర్, గూడూరు శ్రీహరిరావు లను నిర్దోషులు గా భావించి విడుదల చేశారు.

ఈదగాలి, చవటపాళెం కేసుల తర్వాత ఇంతమందికి యావజ్జీవిత ఖైదు శిక్ష విధించిన కేసు జిల్లాలో ఇదే. తీర్పు చెప్పె రోజు కోర్టు హాలు, ఆవరణం ఇరు పక్కల జనంతో క్రిక్కిరిసి పోయాయి. పోలీసులు ప్రత్యేక బందోబస్తు ఏర్పాటు చేయవలసి వచ్చింది.

జనార్దన రెడ్డి 59 జన్మదినోత్సవంలో అభినందిస్తున్న మంత్రి పెంచలయ్య

## జిల్లా వార్తలు

### ఇందుకూరు పేట గ్రంథాలయ ప్రారంభం

ఇందుకూరు పేట లోని ఎంకెఆర్ హైస్కూల్ లో స్వర్గీయ ఎర్రం రెడ్డి, బాలకృష్ణారెడ్డి (వై.బి.రెడ్డి) పేర ఒక గ్రంథాలయాన్ని స్థాపించారు. 18తేది దీని ప్రారంభోత్సవం;శ్రీ ఎన్ ఎస్ కృష్ణమూర్తి రిబ్బన్ కత్తిరించారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, స్కూలు కమిటీ అధ్యక్షుడు శ్రీ మాగుంట కోటారెడ్డి, శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి పాల్గొన్నారు. వక్తలందరూ స్వర్గీయ వై.బి రెడ్డి సాహిత్య పిపాసను ప్రస్తుతించారు. హెడ్మాష్టర్ శ్రీ అమానుల్లా సుల్తాన్ నివేదిక చదివారు; కమిటీ కరస్పాండెంట్ డాక్టర్ పెళ్ళకూరు రవీంద్ర రెడ్డి సభ నిర్వహించారు; శ్రీ ఎవి రంగావారి వందనాలు చెప్పారు.

### కామాక్షమ్మ సన్నిధిలో కల్లు ప్రియుల ఆగడాలు

జొన్నవాడ కామాక్షమ్మను దర్శించను వెళ్లేవారికి కల్లు ప్రియుల ఆగడాలు పెద్ద చికాకును కల్గిస్తున్నాయి; బుచ్చి నుంచి జొన్నవాడకు వెళ్లే రోడ్డు పొడవునా కల్లు, సారాయి అంగళ్లు దండిగా వున్నాయి. అక్కడ త్రాగి వచ్చే వారు రోడ్డు పైనే తిష్ట వేస్తున్నారు. మధ్యాహ్నం సమయంలో ఈ త్రాగుబోతులు నడిచి వెళ్లే వారిని, వాహనాలను కూడా ఆపి వేధిస్తున్నారు. ఆడవారు ఒంటరిగా వెళ్లడానికి భయపడి పోతున్నారు. పోలీసులు అప్పుడప్పుడు అరోడ్ పై తిరిగి మందు బాబులను తగిన రీతిలో సత్కరిస్తే తప్ప ఈ గొడవలు సద్దుమణ గవు. ఎస్‌పి గారూ - ఒక సారి మఫ్టీలో వెళ్లి చూడండి, ఆ బాధేమిటో మీకే తెలుస్తుంది!

### కావలి వార్షికోత్సవం

కావలి విశ్వోదయ బాలికల పాఠశాల 39 వార్షికోత్సవం 20 తేది జరిగింది. కరస్పాండెంట్ శ్రీ బి. శివప్రసాద రావు అధ్యక్షించారు. డిఇఒ శ్రీ ఎన్. శ్రీ రామమూర్తి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. జిల్లా రాష్ట్ర స్థాయిలో జరిగిన సైన్సు ఫెయిర్‌లలో ప్రథమ బహుమతి పొందిన విద్యార్థిని కుమారి డి. కళ్యాణిని సభలో అభినందించారు. రిటైర్డైన టీచరు బి. పద్మావతి, కె. లలితా బాయిలను పిల్లలు సన్మానించారు. పోటీల్లో విజేతలకు డాక్టర్ వి. జోషి, శ్రీ డి. మనోహర రెడ్డి బహుమతులు పంచారు. బాలుర పాఠశాల హెడ్మాస్టరు శ్రీ ఎ.

కొరవ 7 పేజీలో



తెలుగుదేశం నుంచి బహిష్కృతుడయ్యే సమయంలో ఉదయగిరిలో ఎన్టీఆర్‌తో పాటు చివరి సమావేశంలో పాల్గొన్న శ్రీనివాసులు రెడ్డి; ఈ పర్యటనలోనే ఎన్టీఆర్ శీనయ్యను అవమానించారు.

## శ్రీనివాసులు రెడ్డి

11 పేజీ [illegible]

1978 ఎన్నికలలో ఇందిరా కాంగ్రెస్ నాయకత్వ బాధ్యత జిల్లాలో జనార్దన రెడ్డి ఏకాకిగా నిర్వహించ వలసి వచ్చింది. అందువల్ల శ్రీనివాసులు రెడ్డి తప్ప తక్కిన తొమ్మిది మంది జనార్దనీయులే. అప్పుడు శాసన సభ కాంగ్రెస్ పార్టీ నాయకుడుగా ఎన్నికైన డాక్టర్ చెన్నారెడ్డి, జి.ప. ఛైర్మన్‌గా తన సోదరునికి, సమితి అధ్యక్షుడుగా తనకు పంచాయితీ రాజ్ మంత్రిగా సుపరిచితుడు పాత సంబంధాలుండే నాయకుడు కాబట్టి శ్రీనివాసులు రెడ్డి మంత్రిత్వానికి ప్రయత్నించారు. అది కాస్తా జనార్దన రెడ్డి తన్నుకపోయారు; రెవిన్యూ శాఖలో 'సూపర్ చీఫ్ మినిస్టరు' అనే పేరు వచ్చేటట్లు అధికార పూర్ణుదయ్యారు. ఇది శ్రీనివాసులు రెడ్డికి ఆశని పాతమైంది; గుండె కోత అయింది!

కాంగ్రెస్‌లో జనార్దన రెడ్డిని అధిగమించి పోవడం అసాధ్యం అనుకున్నారో ఏమో నిస్పృహ నిరాశలతోనే లేక రాజకీయ వాతావరణాన్ని గ్రహించి ముందే అప్రమత్తులైనారో ఏమో! ఇక ఎన్నికలు మూడు మాసాలుండగా ముందే తన అనుచర వర్గంతో ఎం.ఎల్.ఏ. క్వార్టర్సు నుండి హిమయత్ నగర్‌లోని తెలుగుదేశం కార్యాలయానికి నడిచి పోయి ఆ పార్టీలో చేరిపోయారు. 1983 ఎన్నికలలోను, 1985 మధ్యంతర ఎన్నికలలోను కోవూరు నుండి శాసనసభకు ఎన్నికైనారు– వెంకటగిరిని తన సోదరుని కోసం వదలి పెట్టారో ఏమో తెలియదు. ఆ పార్టీలో కూడా ఇమడలేక పోయారు. చంద్రబాబు నాయుడు మీద దుమ్మెత్తి పోసినందువల్ల 1987 నవంబరులో పార్టీ నుండి బర్తరఫ్ గావింప బడ్డారు. ఆ చంద్రశేఖర రెడ్డిని పార్టీ బహిష్కృతుణ్ణి చేయడం, తననూ న్యూనతగా చూడ మొదలు పెట్టడం వల్ల కూడా శ్రీనివాసులు రెడ్డి బర్తరఫ్ వార్యం కాగల పరిస్థితులు తనకు తాను కల్పించుకున్నాడేమో చెప్పలేము. రాజకీయ వాతావరణ శాస్త్రవేత్త కాబట్టి, తరువాత ఎన్నికలలో తెలుగుదేశం పతన మవుతుందని పసికట్ట గలిగాడేమో. కాంగ్రెస్‌లో చేరాడు. తెలుగుదేశం నుండి బయట పడిన తర్వాత రాష్ట్ర వ్యాప్తంగా పర్యటించి రామారావును తిట్టిన తిట్టుతిట్టకుండా 250 సభలలో తూర్పార బట్టారు. శ్రీనివాసులు రెడ్డి తర్వాత పలుసార్లు ఈ 250 సభలను గూర్చి గర్వంగా ప్రస్తావిస్తూ వుండేవారు. ఆయన పునః ప్రవేశాన్ని సుగమం చేసింది ఈ ఎన్టీఆర్ వ్యతిరేక ప్రచారమే! అయితే ఆయన అవకాశవాది అని, అనుకూల మైతే ఆకాశానికెత్తి పొగెడదం, ప్రతికూలమైతే ఎంత దిగజారియైనా దూషించడానికి వెనుకాడక పోవడం వంటివి ఆయన సహజ లక్షణాలు అని శ్రీనివాసులు రెడ్డికి అవకాశ వాది అనేముద్రను శాశ్వతంగా కల్గించాయి. అంతే కాదు ఆయన్ను ఎవ్వరికీ కాకుండా చేశాయి.

రాజకీయంగా ఎంత విలకడ లేని వాడనిపించుకున్నా, వాటిని సమర్థించుకునే వాదనాపటిమ, నోరు గల వాడు కాబట్టి అవన్నీ కప్పి పుచ్చుకో గలిగాడు; స్వతంత్రుడుగా గూడూరు నుండి ఒకసారి; కాంగ్రెస్ అభ్యర్థిగా వెంకటగిరి, కోవూరులలో రెండుసార్లు; తెలుగుదేశం అభ్యర్థిగా కోవూరు నుండే రెండు సార్లు మొత్తం ఐదు సార్లు శాసనసభ్యుడు కాగలిగాడు. అంతే కాదు ఇప్పుడు జరుగుతున్న శాసనసభా సమావేశంలో తప్ప, శాసనసభ్యుడైన మొదటి రోజు నుండి ఒక్క రోజు కూడా గైర్ హాజర్ గాని ఘనత శ్రీనివాసులు రెడ్డి సంపాయించు కోగలిగాడు.

శాసనసభ్యుడుగానే కాదు, రెండు సార్లు కాంగ్రెస్‌లోను, ఒక సార్లు తెలుగుదేశంలోను మంత్రి కాగలిగాడు. 1981 లో ప్రప్రథమంగా అంజయ్య ఏర్ బస్ మంత్రి వర్గంలో సీటు సంపాయించి, చక్కెర, గనులు, పంచాయితీ రాజ్ శాఖలను; 1989 లో డాక్టర్ చెన్నారెడ్డి మంత్రివర్గంలో రోడ్లు భవనాలు, పశు సంవర్ధక శాఖలను; 1983,85 లలో తెలుగుదేశం ప్రభుత్వంలో ఇరిగేషన్, రోడ్లు భవనాలు, రెవిన్యూ శాఖలను నిర్వహించారు. ఇరిగేషన్ మంత్రిగా తెలుగు గంగ వల్ల నెల్లూరు రైతాంగం ఎక్కువ లాభపడేటట్లు శ్రీనివాసులు రెడ్డి చేసిన కృషి ప్రశంసలకు పాత్రమైంది.

నిర్భీకుడైన, చైతన్యవంతుడైన, సమస్యార్థకుడైన, విశ్వసించడానికి విస్మరించడానికి వీలు లేని అసాధ్యుడుగా తన పేరును ఆంధ్ర రాజకీయాలలో సుస్థిరం చేసుకొని నిష్క్రమించారు శ్రీ శ్రీనివాసులు రెడ్డి. కక్ష కార్పణ్యం, ఈర్ష్యాద్వేషాలు, పగలు సెగలతో ఎదుటి వారి వినాశనాన్ని కోరుకోకుండా, తన వున్నతికి తన శక్తి సామర్థ్యాలను, ప్రజా సాన్నిహిత్య ప్రవృత్తిని, సేవనురక్తిని సద్వినియోగం చేసుకొని వుంటే శ్రీనివాసులు రెడ్డి ఇంకెంతో పైకి పోయి వుండేవారు, అందరి ఆదర అభిమాన గౌరవాలకు పాత్రుడై వుండేవారు. ఆ బలహీనతలను అధిగ మించ లేక పోయినందువల్ల ఆశాభంగాలు, ఆవేదనలు, హృదయాం దోళనలు, జయాపజయ వుద్విగ్న వ్యధాభరిత క్షణాలలో అశాంత చిత్తుడై అర్థంతరంగా కన్ను మూయ వలసిన దురదృష్టవంతు డయ్యాడు శ్రీనివాసులు రెడ్డి.

నెల్లూరు జిల్లాలో ఎన్నదగిన ఒక నాయకుడుగా సుస్థిర స్థానాన్ని ఏర్పరచుకొని అమరుడయ్యాడు శ్రీనివాసులు రెడ్డి. వారి కుటుంబానికి మా ప్రగాఢ సానుతాపం తెలియజేస్తున్నాము.

– శ్రీ రామమూర్తి



## జిల్లావార్తలు

5 పేజీ తరువాయి

సూర్యప్రకాశ రావు మాట్లాడారు; శ్రీమతి బి.వి. రత్నమ్మ వందనాలు చెప్పారు.

### గంగపట్నం పోస్ట్‌మాన్ పై ఆడ పిల్లల ఫిర్యాదు

ఇందుకూరు పేట మండలం గంగపట్నం పోస్టుమ్యాన్ గ్రామంలోని ఆడ పిల్లల పట్ల అసభ్యంగా ప్రవర్తిస్తున్నాడని, జాబు ఇచ్చే నెపంతో ఇళ్లలో దూరి వేధిస్తున్నాడని ఒక జాబు వచ్చింది. గ్రామ పెద్దలకు ఫిర్యాదు చేసినా, అధికారులకు చెప్పినా అతడ్ని ఎవరూ ఏమీ చేయలేక పోతున్నారట.

సూపరింటెండెంట్ గారూ – విచారించి, నిజమైతే కఠినంగా శిక్షించండి!

## నెల్లూరు ముచ్చట్లు

6 పేజీ తరువాయి

విధించారు. ఉదయం 11.45, మధ్యాహ్నం 2.30, సాయంత్రం 6.30, రాత్రి 9.30 గంటలు ప్రదర్శన సమయాలట.

జాతరలలో జంతు బలుల నిషేధం వలె పని చేస్తాయిటు వంటి ఉత్తర్వులు. ఏ సినిమా హాలు ఆయన మాట వింటుంది?

## దశయ్యకు ఉద్యోగం

ఉద్యోగం అంటే పొరలంత కంది; జీతం భత్యాలు లేని, అధికారాలు అనుభవాలు లేని ఒక చాకిరీ పదవన్నమాట.

రాష్ట్ర గ్రామాధికార్ల సంఘాధ్యక్షుడుగా వూడి పోయిన వుద్యోగాలను హోరాహోరీగా పోరాడి తిరుగా ఇప్పించ గలిగిన శ్రీ చివల్లే దశరథరామిరెడ్డి 14 తేది తాడేపల్లి గూడెంలో జరిగిన సభలో మళ్లీ గ్రామ పరిపాల నాధికార్ల సంఘ అధ్యక్షుడుగా ఎన్నికైనారు. ప్రధాన కార్యదర్శి పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన శ్రీ ఎం.వి. నారాయణ రావు గారట. తిరిగే కాలు, ఆందోళన చేసే నోరు వున్న దశయ్య ఈ పదవికి అర్హుడు. అభినందనలు.

## డయాబెటిక్ సదస్సు

మధుమేహ వ్యాధి పై ప్రజలలో వున్న అపోహలు తొలగించడానికి 21 తేది నెల్లూరులో ఈ వ్యాధి పై ఒక జాతీయ సదస్సు నిర్వహించారు. అన్ని రాష్ట్రాల నుంచి దాదాపు 200 మంది డయాబెటిక్ నిపుణులు ఇందులో పాల్గొన్నారు. బొంబాయి డాక్టర్ శ్రీ అనిల్ కపూర్ ఇన్సులిన్ పైన; హైదరాబాద్ నిమ్స్ డయాబెటిక్స్ అధిపతి డాక్టర్ పివిరావు ఆహార నియమాల పైన; మద్రాసు మెడికల్ కాలేజి డయాబెటిక్ విభాగాధిపతి ప్రొఫెసర్ శ్యాం జి. మోసెస్ ఇతర సమస్యల పైన ఉపన్యాసాలు చేశారు. నెల్లూరు డాక్టర్ బి. అనిల్ కుమార్ రెడ్డి ఈసదస్సు నిర్వహించారు.

## అర్థ శాస్త్రంలో డాక్టరేట్

నెల్లూరీయుడు శ్రీ కదివేటి [illegible]యభాస్కర్‌కు వెంకటేశ్వర విశ్వ విద్యాలయం డాక్టరేట్ బహూకరించింది. నెల్లూరు జిల్లాలో గ్రామీణ పేద ప్రజల పై సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం



ప్రభావం అనే అంశం పై ఆయన సమర్పించిన పరిశోధనా పత్రం ఆధారంగా పిహెచ్‌డి ప్రదానం చేశారు.

విజయభాస్కర్, సిఎఎం కాంపౌండ్‌లోని రాజీవ్ జూనియర్ కాలేజి లెక్చరరు; కోవూరు పంచాయితీల విస్తరణాధికారి శ్రీ కె. కృష్ణయ్య కుమారుడు; సర్వోదయ [illegible] విద్యార్థి. ఆయనకు మా అభినందనలు.

## లక్ష్మి క్లినిక్

డాక్టర్ ఎస్. భాస్కర్ ఎం.బి.బి.ఎస్. డాక్టర్ ఎస్. అంతాళ్, ఎం.డి., డి.జి.ఒ. గారలు "లక్ష్మి క్లినిక్" ను పొగతోటలోని నూతన భవనంలో 24 తేది ప్రారంభించారు. శుభమస్తు! దిగ్విజయమస్తు!!

## మరణం

స్టోన్‌హౌస్‌పేట కె.ఎ.సి. గవర్నమెంటు జూనియర్ కాలేజి మాజీ సర్వోదయ కళాశాల ఎడ్యుకేషన్ కమిటీ ప్రెసిడెంటు, దానధర్మాలలో ఎముకలేని చేయిగా కీర్తిగాంచిన వైశ్య ప్రముఖుడు శ్రీ కామిశెట్టి ఆదిశేషయ్య 25 తేది కాలధర్మం చెందారు. ఆయనకు భార్య వుంది. ఆమెకు మా సంతాపం.

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | 9672 | 3,500/- |
| | 9674 | 3,700/- |
| 9672 కొత్తవి | | 2,650/- |
| సన్నాలు (పాతవి) | | 3,000/- |





**Before the Motor Accidents Claims Tribunal**
(District Judge) : Nellore
I.A. No. 822 of 92
O.P. – of 92

(1) M.N. సులభ వజీరాలు
– పిటీషనర్లు/క్లెయిమెంట్సు

Vs

(1) V. మోహన్
(2) United India Insurance Co.,
– రెస్పాండెంట్లు

To the Ist respondent V.Mohan, S/o. Subbaiah, Owner Town Bus No. 30 residing at door no. 22/731, Moolapet, Nellore

పై నెంబరు పిటీషనర్లు కాంపన్సేషన్ పిటీషన్ దాఖలు చేయుటలో ఆలస్యమును క్షమించమని కోరుచూ పై I.A. 822/92 పిటీషన్ దాఖలు చేసి నందుకు మీకు నోటీసు నిమిత్తం (S.S. ద్వారా) 19.3.93 తేది వాయిదా వేసి వున్నారు. కావున ఆ రోజు ఉదయం 10 గంటలకు పై కోర్టు వారి ఎదుట హాజరై తమ ఆక్షేపణలను తెలుపు కోవలసినది. లేని యెడల మీ పరోక్షమందు తీర్మానించబడునని తెల్పుకోనైనది.

టి. శ్రీహరి,
పిటీషనర్ల తరపు అడ్వొకేటు

జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
ఆరు నెలలకు రూ. 50/-
విడిప్రతి రూ. 2.00



## In the Court of Principal Dist. & Sessions Judge

Kurnool
O.P. 53/1993

1. Renukambai alias Radhabai, Wife of Late Bankat Singh, 45 yrs.
2. Sunil, S/o. Late Bankat Singh, 25 yrs.
3. Anil, S/o. Late Bankat Singh, 25 yrs.
4. Ramsingh, S/o. Late Bankat Singh, 23 yrs.
5. Satish Singh, S/o. Late Bankat Singh, 20 yrs.

(Petitioners 2 to 5 are sons of Petitioner No.1, and all are residents of H.No. 9-2-59, Patel Road, Raichur (Karnataka) - Petitioners

Vs.

1. Mohinikumari bai, 19 yrs, daughter of Muneendra prasadasingh, H.No. 587, Bairagipattedi, Tirupathi, A.P.
2. Muneendraprasad Singh, 45yrs, (Father's name not known) Govt. Servants of T.T.Devasthanam R/o. H.No. 587, Bairagipattedi, Tirupathi, A.P.
3. Manikyabai, W/o. Tuljaramsingh, 55 yrs. 43/261, N.R.Pet, Kurnool - 518 004.
4. Tuljaramsingh, S/o.Balajisingh, 60 yrs 43/261, N.R. Pet, Kurnool - 518 004.
5. Depot Manager, AndhraPradesh State Road Transport Corporation, Nandikotkur - 518 401.

- Respondents

### GENERAL NOTICE TO ALL PUBLIC

Whereas the above petitioners have filed petition for grant of SUCCESSION CERTIFICATE for the properties of late R. Prakash Babu (RTC Conductor), in the above court, the same is posted to 5.3.1993. The respondents are therefore informed that if they have any objection, they may appear before the above court on 5.3.93 at 10 a.m. either in person, or through duly instructed advocate, without fail.

If they fail for the above, the matter will be decided exparte on the merits of case.

(By order of the court)

Thriveni Ramakrishna
Advocate
43/255, N.R. Peta (Sankalbagh)
KURNOOL - 518 004.

# శివారెడ్డి పద్యాలు

### ఎందుకు బుట్టిస్తాడో

ఎందుకు బుట్టిస్తాడో
యెందుగ్గా జంపుతాడో యెవ్వతెరుగ య్యీ
మందల దేవరహస్యము
గందరగోళమ్ము సృష్టి గడబిడగుంది!

### అమరజీవి

నీకు ఎంతగానో బాకీ నేదురుమల్లి
బాలకృష్ణ బక్కబడుగు ప్రజల
చదువు సాము నేర్పి సాకేవు ముప్పూట
తిండి? కవిని ఎంత తిక్కలోణ్ణి!

పోయిన వారు తిరిగి పుట్టింది యీరోజా
వరకు లేదు. రేపొమాపొచ్చి
నిన్ను గలుసుకుంట నీ యోగక్షేమాలు
తెలుసుకుంట. అంతలేదికాంట!

### ఉండరాదు బ్రతికి

ఉండరాదు బ్రతికి వృద్ధాప్యమొచ్చాక,
బక్కచిక్కి పొయ్యి బరువయాక
కాస్త ముందుగానె కదలేరి పోవాలి
ఇక్కదుంటె ఇంక కుక్క చావె!

### వరూధిని

రాను పోను నీకు రైల్వార్తి చేసిన్న,
కావలంటె నీకు కారు బంపుత.
రైలుకెక్కకుండి నాముద్దు చెల్లించు
కుర్రవాడ! వాడు కొర్కె దీర్చు!

### ప్రవరాఖ్యుడు

చదువు సాము మీదు సాంప్రదాయము
వేరు
కులము వేరు మీదు గోత్రమేరు
మీకు మాకు సాత్తు లోక విద్దూరమ్ము
కాని పోని బేరం కదు విచారం!

### మావూరు మునసబు

మంచి చెడ్డ మట్టు మర్యాద తన సొత్తు
పాలిటిక్సు యింక వట్టు బల్ల!
దేవుడంత టోదు మావూరు మునసబు
పేరు జ్ఞాపకంలా, పెద్ద ప్రాబ్లం!

### శివరాత్రి

ఏమి తప్పు జేస్తె యెందుగ్గ శివరాత్రి
కొక్కప్రొద్దు, ముందె బక్కచిక్కి
ఏనుగంతటోణ్ణి ఎర్రజీమైపొయ్యి
తిరిగి వస్తులుంటె తీరతడిక!

## కన్నీటి వరద

( మొదటి పేజీ కొరవ)

ఖురాన్ ప్రార్థనలు వాతవరణాన్ని మరీ బరువెక్కించాయి.

వచ్చిన జనంలో సగం మంది కూడా కడ చూపుకు నోచు కోలేక పోయారు. సాయంత్రం 4 నుంచి అంతిమ సంస్కారాలు మొదలైనాయి. శవాన్ని ట్రాక్టర్ పై ఎక్కించడం బ్రహ్మ ప్రయత్నమై పోయింది. జనం ట్రాక్టర్‌ను కదలనివ్వలేదు. మెల్లమెల్లగా, కన్నీటి వరదలో తేలే తెప్పలాగా కదిలిందా శకటం. పూలమాలలు కొండలాగా పడ్డాయి. నినాదాలు పిక్కటిల్లాయి. రెండు కిలో మీటర్లు కూడా లేని స్మశానం చేరే సరికి రెండు గంటలు పట్టింది. శివయ్య రెండవ కుమారుడు రాజేంద్ర ట్రాక్టర్ పై ఎక్కి వచ్చారు; ఎమ్మెల్యేలు జె.కె. రెడ్డి, విష్ణువర్ధన్ రెడ్డి, మంత్రి జె.సి. దివాకర రెడ్డి, కలెక్టరు, ఎస్పి, జాయింట్ కలెక్టరు, జిల్లాలోని ముఖ్యాతిక భాగం అధికార్లు, ఆనం రామనారాయణ రెడ్డి, నేగా నారసింహా రెడ్డి, సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి, కోదూరు శ్రీరంగారెడ్డి వంటి నాయకులనేకులు వెంట నడిచారు.

వల్ల కాలువ పక్కన చితికి ఏర్పాట్లు జరిగాయి. పోలీసులు గౌరవ సూచకంగా తుపాకులు పేల్చారు; కుమారులు ప్రసన్న కుమార్ రెడ్డి, రాజేంద్ర బాబు రెడ్డి, జగదీశ్ కుమార్ రెడ్డి చితికి నిప్పంటించారు. స్మశానంలోనూ సందు లేదు. ఆడవారితో సహా తరలి వచ్చారు.

ఏడు గంటలకు అంతా అయిపోయింది; బూడిద మాత్రం మిగిలింది !

* * *

రాజకీయాల వలెనే మృత్యువు తోనూ భీకరంగా పోరాటం సల్పారు శివయ్య. జనవరి మొదటి వారం లో కోవూరు, కోటలలో జరిపిన పర్యటన ఆయన్ను మృత్యు ముఖం లోకి నెట్టింది. ఆ మంచు చలిగాలులలో ఆరోగ్యాన్ని విస్మరించి 200 గ్రామాలు సందర్శించి, అలసిన శరీరంతో హైదరాబాదు చేరిన శివయ్యకు న్యుమోనియా వ్యాధి ముంచుకొచ్చింది. ఆస్పత్రి లో చేర్పించారు. అప్పటి నుంచి జీవన్మరణ పోరాటమే. కిడ్నీ, లివరు, ఊపిరి తిత్తులు పని చేయలేదు. డాక్టర్లు ఎంతో శ్రమించారు. ఒక దశ లో 75శాతం ప్రాణ వాయువును కృత్రిమంగా అందించారు. 50శాతం దాటితే బ్రతకడం కష్టమట. అయినా శివయ్య కోలుకున్నట్లే కన్పించారు. ఆక్సిజన్ అవసరం 45శాతానికి తగ్గింది. కిడ్నీ పని చేసింది. అంతా బాగానే వుందిలే అనుకున్నారు. కాని అది ఆరిపోయే దీపమని ఆలస్యంగా అర్థమైంది. 23తేది సాయంత్రం కన్నుమూశారు.

### మృత్యు ముఖం లోనూ అసెంబ్లీ పై మమకారం

మరణించడానికి మూడు రోజుల ముందు శ్రీనివాసులు రెడ్డి గారు నిజాం ఆస్పత్రి సూపరింటెండెంట్ కు ఒక అభ్యర్థన పత్రం పంపారు. లోపలకు వచ్చి పోయే డాక్టర్ల చేత ఈ విజ్ఞప్తిని తయారు చేయించారట. అసెంబ్లీ సమావేశాలు ప్రారంభమైనట్లుతనకు తెలిసిందని, తన కుటుంబసభ్యులు ఆ విషయం తన దగ్గర దాచి పెట్టారని, తననెట్లయినా అంబులెన్స్ లో అసెంబ్లీకి తరలిస్తే కనీసం సంతకం పెట్టయినా వస్తానని అభ్యర్థించాడట పాపమాయన. కాని ఆరోగ్య పరిస్థితి అందుకు సహకరించ లేదు. ఆ అసంతృప్తి తోనే చివరి శ్వాస విడిచారు శ్రీనివాసులు రెడ్డి గారు.

* * *

శివయ్య ప్రజానురంజకత్వం ఆస్పత్రి లో వుండగానే రుజువైంది. ఆస్పత్రిలో మాట్లాడటానికి, కనీసం కన్పించడానికి వీలు లేకున్నా ముఖ్యమంత్రి నుంచి మామూలు మనిషి వరకు ఎన్ని వేలమంది ఆ వేల రోజుల్లో ఆస్పత్రి సందర్శించారో లెక్కలేదు. పార్టీలు, రాజకీయాలు ప్రక్కన పెట్టి అందరూ వెళ్ళారు. కుటుంబసభ్యులను పలుకరించారు. మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్.జనార్ధన రెడ్డి సైతం జెపీవా పర్యటనకు బయల్దేరే ముందు, 22 తేది ఆస్పత్రికి వెళ్ళి వచ్చారు. రాజకీయ శతృత్వాలు, వ్యక్తిగత స్నేహ సంబంధాలకు అడ్డు రావని నిరూపించారు. విజయభాస్కర రెడ్డి గారు చాలా సార్లు రావడమే కాదు, విదేశాల నుంచి మందులు తెప్పించడంలో, నిపుణులైన డాక్టర్లను నియోగించడంలో ఎంతో శ్రద్ధ చూపారు. అన్ని పార్టీల నాయకులూ ఆస్పత్రి సందర్శించారు.

శివయ్య మృతికి సంతాపం తెల్పుతూ సందేశాలు కుప్ప తెప్పలుగా వస్తున్నాయి. ఎమ్పీ కుమారి కుడుముల పద్మశ్రీ న్యూఢిల్లీ నుంచి సందేశం పంపారు-శివయ్య లేని లోటు ఎవ్వరూ తీర్చలేనిదని! మాజీ మంత్రి శ్రీ ఆనం రామనారాయణ రెడ్డి తెలుగు గంగ ప్రాజెక్టు రూపకల్పన లో శివయ్య చేసిన కృషిని జిల్లా రైతాంగం శాశ్వతంగా గుర్తు పెట్టుకుంటుందని అన్నారు.

* * *

శివయ్య అంతిమ యాత్ర లో జిల్లా ఎమ్మెల్యేలు పాల్గొనక పోవడం విమర్శలకు దారి తీస్తున్నది. జె.కె.రెడ్డి, విష్ణువర్ధన రెడ్డి తప్ప తక్కిన వారంతా ముఖం తప్పించారు. విషాద సంఘటనలలోనూ సంకుచిత వర్గ రాజకీయాలను పాటించే కుసంస్కారం మన ప్రజా ప్రతినిధు లలో వుండడం విచారకరం.

మరి కొందరు, మరింత దిగజారి అంతిమ యాత్రకు వచ్చిన జనం లెక్కలు వేస్తున్నారట; అటువంటి నైచ్యం వారి సంకుచిత తత్వాన్ని వెల్లడి చేస్తుందే తప్ప, మరణించిన వారి కీర్తికి లోపం జరగదు.

* * *

శివయ్య మృతి పట్ల దుఃఖ భారం తో కుమిలి పోవడం తప్ప రాజకీయ ప్రయోజనాలు సాధించడానికి ఏ మాత్రం ప్రయత్నించ కుండా నల్లపరెడ్డి కుటుంబీకులు హుందాగా, హృదయ వైశాల్యం కల్గిన వారుగా ప్రవర్తించారు. హర్తాళ్ళు, సభలు జరిపే యత్నమే చేయలేదు. అభిమానం కల్గిన వారుగా, వారంతట వారు స్వచ్ఛందం గా అంగళ్ళు మూసి సంతాపం ప్రకటించారు. నెల్లూరు, గూడూరు టౌన్లలోనూ ఆరోజు పలు వ్యాపార సంస్థలు, సినిమా హాళ్ళు సంతాప సూచకంగా మూతపడ్డాయి. విద్యానగర్ నుంచి కోట వరకు ఏ తలుపూ తెరవలేదు.

## జనవాణి

(3 పేజీ కొరవ)

ఆధునిక ప్రచార సాధనాల వల్ల అయోధ్య సంఘటన, మరుక్షణంలోనే, ప్రపంచంలోని యావన్మంది ముస్లింలను (తరమ అంతా కలహాలతో సతమత మౌతున్నప్పటికి) ఒక త్రాటి మీదకు తీసుక రాగల్గింది. సుమారు 5 శతాబ్దాలకు పూర్వం, బాబరు జరిపాడన్న దుష్ట చర్య అప్పటి సమాజానికి యిట్టి అవకాశం కల్పించక పోవడమే కాక అధికార బలంతో న్యాయాన్ని అణగ ద్రొక్కి నప్పటి నుండి రగులుతున్నయీ సమస్య, డిశంబరు 6 నాటికి మన కందరికీ శాపంగా మారింది. యీ దుర్ఘటనను ఒక పీడకలగా పరిగణించి యిక మీదటయినా మొండి పట్టుదలకు (మసీదు, రామాలయం అక్కడే కట్టాలనే మూర్ఖత్వం) తావివ్వక, దుష్ట శక్తులకు దూరంగా వుండి, మానవ కళ్యాణానానికి మార్గాలను సుగమం చేసేందుకు ప్రతి ఒక్కరూ కృషి చేయాలి. ఇందులో భాగంగా అధిక సంఖ్యాకులు, అల్పసంఖ్యాకుల తత్వానికి తావివ్వక అందరూ ఒకే బాటన నడిచేందుకు సరిపడే కామన్ సివిల్ కోడ్‌కు మనమందరం బద్ధులమ య్యేందుకు త్యాగం చేయాలి.

\- ఎన్. రామచంద్రారెడ్డి
కొచ్చిన్

### ఉద్యోగుల పట్ల వివక్షత

ఈ మధ్య హైదరాబాదు లోని సెక్రటేరియట్ లో ఒక విచిత్రమైన ఫైలు సర్క్యులేషన్‌కు వచ్చింది. జూలై 1 తేది తరువాత రిటైర్ అయ్యేవారు సంవత్సరాంతాన ఉద్యోగ విరమణ చేయవలెనని అందులో పేర్కొన్నారు. కాని జూన్ 30 వ తేది వరకు రిటైర్ కామన్న వారి సంగతి దానిలో ప్రస్తావించలేదు. ఉద్యోగ విరమణ విషయంలో ఇది వరకే చాలా అన్యాయం జరిగింది. జూలై 1తేది పుట్టిన ఉద్యోగి, ఆ ముందునెల అంటే జూన్ 30 వ తేది రిటైర్ అయిపోతాడు. కాని జూలై 2 వతేది పుట్టిన వాడు ఆ నెల చివరి వరకు కొనసాగవచ్చు. ఇది అన్యాయం. ఉద్యోగ విరమణ ఆఖరు ఘట్టం లో ఎన్నో బాధ్యతలు నెత్తిన పడుతాయి. వీటిని మానవతా రీత్యా గమనించాలి. కాబట్టి ఆర్థిక సంవత్సరం మొదలైంది మొదలు ముగిసే లోగా ఏ తేదీలో రిటైర్ కావల్సి ఉన్నా డిశంబర్ 31 వరకు పొడిగించాలని అభ్యర్థన.

\-బి. కొండయ్య
కావలి.

## పంచాంగము

### ఫిబ్రవరి తిథులు

ఫాల్గుణ శుద్ధ

| | |
|---|---|
| తే 27శని షష్ఠి రా.గ. | 3.45 వ |
| తే 28ఆది సప్తమి రా.గ. | 4.09 వ |

మార్చి తిథులు

| | |
|---|---|
| తే 1 సోమ అష్టమి రా.గ. | 3.57 వ |
| తే 2 మంగళ నవమి రా.గ. | 3.05 వ |
| తే 3 బుధదశమి రా.గ. | 2.10 వ |
| తే 4 గురు ఏకాదశి రా.గ. | 2.17 వ |
| తే 5 శుక్రద్వాదశి రా.గ. | 10.51వ |

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఎ

# ప్రకటనలాపితే ఖర్చు తగ్గుతుందా?

దాసరి నారాయణరావు పత్రికాధిపతి గా ఉండి కూడా ఆయన ఆంధ్రప్రదేశ్ నిర్మాతల మండలికి అధ్యక్షుడి గా ఎన్నికైనపుడు తీసుకున్న ప్రథమ నిర్ణయం -పత్రికలలో సినిమా ప్రకటనల వ్యయం తగ్గించడం. పేపర్ పబ్లిసిటీ వల్ల విపరీతంగా బడ్జెట్ పెరిగి పోతోందట-ముఖ్యంగా చిన్న చిత్రాలకు! "త్వరలో విడుదల..నేటి చూడండి... యూత్ఫై రోజా.. శతదినోత్సవం... 175రోజులు...ఇంకా.. అపైన.." ఇవన్నీ చివరి వగం పేజీలేనట. ఇక తారల జన్మదినోత్సవ అనుబంధాలు వేయకూడదట. అలాగే పంపిణీదారులు ఇచ్చే పత్రికా ప్రకటనల మీద కూడా ఆంక్షలు విధించారు. చిత్ర పరిశ్రమలో 'స్లంప్' వచ్చినప్పుడల్లా పత్రికా ప్రకటనల విషయం లో ఆంక్షలు విధించడం మామూలే. కాని, ఈ ఆంక్షలను ఎవరు పాటిస్తారు? చిత్ర నిర్మాణ వ్యయం తగ్గించడానికి ఈ ఆంక్షలు సమంజసమా?

## కొత్త చిత్రాల పేర్లు

డి.ఎస్.ఆర్.ఫిలింస్ "రౌడీ సిపాయి", శ్రీ వీరభద్ర క్రియేషన్స్ "అయోధ్య", సవితా చిత్రా ఫిలింస్ "అధినేత", కె.ఆర్ కంబైన్స్ "సంఘర్షణ", శ్రీ సాయి దుర్గా ఫిలింస్ "విద్రోహం", భారతీ ఫిలింస్ డివిజన్ "ఘరానా బుల్లోడు", అశోక్ ఆర్ట్స్ "బంగారు కోడిపెట్ట", అమ్మా ఆర్ట్ క్రియేషన్స్ "భార్యంటే ఇలా ఉండాలి", శ్రీ వెంకటేశ్వర ఆర్ట్ క్రియేషన్స్ "లవ్ వార్", శ్రీ లక్ష్మి ఫిలిం క్రియేషన్స్ "మా నాన్న బ్రహ్మచారి", సిరి మూవీస్ "మంత్రి గారి అమ్మాయి", సాధనా ఆర్ట్ క్రియేషన్స్ "ప్రేమ కోసం బాబూ కంత్ బ్రహ్మ", కమలా సినీ ప్రొడక్షన్స్ "దేవుని వంటే రక", మధు ఫిలింస్ డివిజన్ "పద్మవ్యూహం", హంసాలయా ఫిలిమ్స్ "కుర్రాళ్ళ రాజ్యం", రవి ఆర్ట్స్ "కమలదళం", కిరణ్ ఫిలిమ్స్ "మిస్టర్ శరత్", లక్ష్మీరూప ప్రొడక్షన్స్ "ఎస్.పి.భార్గవి", విక్కీ ఎంటర్ ప్రైజస్ "అడవిసింహం", శ్రీ సాయి ప్రసన్న కంబైన్స్ "రథసారథి", రవీంద్ర మూవీస్ "పెళ్ళి గోల", చాణక్య ఆర్ట్ మూవీస్


నక్షత్రపోరాటం చిత్రంలో అరుణ్‌పాండ్యన్, సింధూజ

దర్బార్", రామ్ చరణ్ ప్రొడక్షన్స్ "రౌడీ గారి చెల్లెలు" దీపికా ప్రొడక్షన్స్ "గూండా జంక్షన్" శ్రీదేవి కళా మందిర్ "కాలేజీ రౌడీ", రాజ్యలక్ష్మి సినీ చిత్ర "రౌడీ రాజకీయం", శ్రీ సాయి ప్రసన్న కంబైన్స్ "రావణ కాష్టం" శరసిని కంబైన్స్ "అల్లరి రాజా" అశ్వని ఆర్ట్ మూవీస్ "కిలాడి మొగుడు" భారతీ ఫిలిం డివిజన్ "అల్లరి బుల్లోడు" జోకర్ ఫిలింస్ "జాలీ జోకర్" దాల్టన్ పిక్చర్స్ "కుటుంబసమేతం", విజయ కల్పన ఫిలింస్ "రౌడీ పిల్ల" శ్రీ రాఘవేంద్ర "ప్రియుడు", శ్రీ అన్న పూర్ణ సినీ చిత్ర "పాండవ పోరాటం", శ్రీ అనుపమ ప్రొడక్షన్స్ "పంచపాండవులు", శ్రీ బాలాజీ ఆర్ట్ క్రియేషన్స్ "ఖైదీ మామయ్య", అళగప్ప ఆర్ట్ క్రియేషన్స్ "కాలేజీ రోజులు", శ్రీవెంకటకృష్ణా ఫిలిమ్స్ "మృత్యుంజయుడు", నాగ ప్రశాంత క్రియేషన్స్ "రంగుల వల

★★★



# ఖుష్బూ షాంపూ!

ప్రముఖ తమిళ దర్శకుడు కె.బాలచందర్ ఎంత విశిష్టమైన చిత్రాలు రూపొందిస్తారో, అంత ప్రత్యేకంగా వుంటాయి ఆయన చిత్రాల పేర్లు. ప్రదు-ఖుష్బూ తో ఆయన నిర్మిస్తున్న చిత్రం పేరు "డ్యుయెట్" ఖుష్బూ పేరుతో ఆమె అభిమాని అయిన ఒక పారిశ్రామిక వేత్త "షాంపూ" ను తయారు చేస్తున్నారు! తమిళనాడు లో ఏ నాయికకూ లేని అభిమాన సంఘాలు ఖుష్బూకు వున్నాయి. ఈమెతో మాట్లాడాలన్న కుతూహలం కొద్దీ ఏ అభిమాని అయినా ఈమె ఇంటికి ఫోన్ చేస్తే; అతని పేరు; టెలిఫోన్ నెంబరు తెలుసుకొని, ఐదు నిమిషాల తర్వాత అతనికి ఫోన్ చేస్తుంది. ఇటీవల ఈమెకు హఠాత్తుగా కడుపు నొప్పికి (అపెండిసైటిస్) ఆపరేషన్ జరిగిన సమయం లో ఈమె అభిమానులంతా ఎన్నో ఆలయాలలో అర్చనలు చేయించారు. ఐతే ఈమెను చూసి ఈర్ష్య పడుతున్నకొందరు తారలు ఆమె గర్భ విచ్ఛిత్తి చేసుకుందన్న పుకార్లు పుట్టించారు.

# శ్రీదేవి కంచి పట్టు చీరలెందుకు కొన్నట్లు?

బొంబాయి లో కొత్త కొత్త తారలు ప్రవేశిస్తున్నారు. శ్రీదేవికి అంతకంతకు వయసు మీద పడుతోంది. అందేత, దక్షిణ భాషా చిత్రాల వంక దృష్టి మరల్చక తప్పలేదు. భాగ్యరాజా రూపొందించే "ఒరు ఊరిలే ఒరు రాజకుమారి" (ఒక ఊళ్ళో ఒక రాజకుమారి)" చిత్రంలో ఈమె ఇటీవల బుక్ అయింది. ఈమె మెడలో మూడుముళ్ళు పడే సమయం ఆసన్నమైనట్లుంది. ఇటీవల కంచి నుంచి కొన్ని లక్షలు ఖరీదు చేసే పట్టు చీరలు తెప్పించి సిద్ధంగా వుంచుకుంది.

## గాయని సుశీల పుత్రుని వివాహం

పి. సుశీల ఏకైక పుత్రుడు జయకృష్ణ కు సంధ్యారేఖ తో బెంగుళూరు లో వివాహం జరిగింది. మద్రాసు లో ఏర్పాటు చేసిన రిసెప్షన్ కు డాక్టర్ భానుమతీ రామకృష్ణ, అంజలీదేవి వంటి సీనియర్ ఆర్టిస్టులు సైతం హాజరై, వధూవరులను ఆశీర్వదించారు.

## అక్టోబర్ నుంచి మహేష్ బాబు చిత్రం.

హీరో కృష్ణ పుత్రుడు మహేష్ బాబు చాలాకాలం తర్వాత నటించే చిత్రం వైజయంతీమూవీస్ వారిది. దర్శకత్వం:కె.రాఘవేంద్రరావు. నిర్మాత: అశ్వనీదత్.

## "కుర్రది-కుర్రాడు"

రేలంగి నరసింహారావు పని బాగుంది. వరుసగా హాస్య చిత్రాలు రూపొందిస్తూ, తన ప్రత్యేకత నిలుపుకుంటున్నారు. ఈయన కొత్త చిత్రం "కుర్రది-కుర్రాడు" లో హరీష్, దీప్తి, సత్యనారాయణ, సుధాకర్, బ్రహ్మానందం, బాబూ మోహన్, గిరిబాబు, మల్లికార్జునరావు పాత్రధారులు

# పరుగులు పెట్టే కథతో ప్రేక్షకులు సమ్మోహితులే!

# రక్షణ




హీరో, దర్శకుడు, సాంకేతిక నిపుణులకు తోడుగా తదితర నటులందరూ కష్టించి పని చేస్తే ఆ చిత్రం తప్పక విజయవంతం కాకుండా ఎట్లుంటుంది? ఆ కోవకు చెందిన తాజా చిత్రమే నాగార్జున- నారాయణ రావుల ద్వితీయ యత్నం "రక్షణ". పదునైన మాటలు, వీనుల విందైన సంగీతం, ప్రత్యేకత సంతరించుకున్న ఫైట్లు, ధీటైన నటన, వీటన్నింటినీ ఏరికూర్చిన దర్శక ప్రతిభ యువ ప్రేక్షకులనుసమ్మోహితులను చేస్తుంది. చిత్ర ప్రారంభంలో హీరో ప్రాణం లేకుండా పడి ఉండే సీన్ ను కెమెరా మెన్ అద్భుతంగా చిత్రీకరించాడు; అది చిత్రానికి ప్రాణం పోసింది. విశ్రాంతికి ముందు శిక్ష వేసిన జడ్జి పై దోపి దూసుక పోయే సన్నివేశంలో హీరో అడ్డు పడడం, పర్మిషన్ లేకుండా వీధి మీటింగు పెట్టే రాజకీయ నాయకుల తీరువల్ల ట్రాఫిక్ జామ్ అయ్యి ఒక పాప ప్రాణం కోల్పోయినపుడు సందర్భోచిత నిర్ణయం తీసుకొని హీరో మీటింగు వేదికను ధ్వంసం చేయడం, రాష్ట్రం లో చర్చనీయాంశమైన నక్సలైట్ల కిడ్నాప్ ను పోలిన ఉదంతం- ఒక సంవత్సరం కిందట హైదరాబాదు లోని గాంధీభవన్ లో జాతీయజెండా ఎగుర వేయడం పై పార్టీ - ప్రభుత్వం లోని కీలక నాయకులు కీచులాడిన అలనాటి యదార్థ సంఘటనలు చోటు చేసుకున్నాయి.

'బాంబులు తయారు చేసేవాళ్ళు ఎమ్మెల్యేలుగా వుండడం దేశం చేసుకున్న దౌర్భాగ్యం' వంటి మాటలకు తోడుగా నీతి నిజాయితీ గల పోలీస్ అధికారిని అవినీతి పరుడైన నాయకుడు అడిగే మాటలకు ప్రతి స్పందన గా చెప్పే మాటలు పరుషంగా వున్నాయి. గుక్క తిప్పుకోకుండా నడిచే స్క్రీన్ ప్లే వలలో పడిన ప్రేక్షకులకు కథ పరుగులు పెట్టినట్టు కన్పదుతుంది. రెండో రీల్ లో ఒక యువతిని రేప్ కాకుండా వీరోచితంగా ఫైట్ చేసి హీరో కాపాడే సీన్ లో అమాంతంగా గాలిలోకి లేచినపుడు తీగలు కట్టి లాగిన విషయం స్పష్టంగా కనపడి సమష్టి కృషి లో ఎడిటర్ ఉదాసీనతను ఎత్తి చూపుతుంది. చిత్ర ప్రథమార్థం నుండి ఆవేశానికి ప్రతీక గా నిలిచే హీరో ద్వితీయార్థం లో ఎందుకు డల్ ఎవుతాడో ఎవరికీ అంతుబట్టక పోయినా, నాగార్జున 'శివ' చిత్రం తరువాత అత్యంత పవర్ ఫుల్ పాత్ర లో ఆద్యంతం మెప్పించి విమర్శకుల నోళ్ళు మూయించారు. నాగార్జున నటనా వైదుష్య చిత్ర జాబితా లో 'రక్షణ' కూడా ఒకటవుతుందన్న దాంట్లో సందేహం లేదు.

ఇక కథ లోకి వస్తే ఐ.పి.ఎస్ ట్రైనింగ్ పూర్తి చేసుకొని కొత్తగా సర్వీసు లో చేరిన బోస్(నాగార్జున) అత్యంత ఆవేశపరుడు. అవినీతి, అలసత్వం సహించలేడు. విధి నిర్వహణ లో ఎవరినీ లెక్క చేయక ముక్కు సూటిగా సాగి పోయే అధికారి. డ్యూటీ లో చేరే సమయం లో ఒక యువతిని రేప్ చేయను యత్నించిన యువజన నాయకుడ్ని, అతనికి సహాయ సహకారాలు అందించిన సర్కిల్ ఇన్స్పెక్టర్ ను అరెస్ట్ చేస్తారు బోస్. వారిని విడిపించను ప్రయత్నించిన పై అధికారి పైనే చెయ్యి చేసుకొని మర్నీ వారిని కటకటాల వెనుక తోస్తారు. మంత్రి(కిషన్ రెడ్డి) కోరిక మేరకు సిటీ లో రౌడీలుగా చలామణీ అయ్యే నల్ల శ్రీను(కోట శ్రీనివాసరావు) జిన్నా(సలీం గౌస్) పేద ప్రజల కాలనీ ఖాళీ

తరవ 10 పేజీలో

## సణుగుడు

(4 పేజీ తరవ)

నెల్లూరులో టెలిఫోన్లో మాట్లాడాలంటే మైకు పెట్టుకొని విధిలోచేరి అరవడంగా వుంది! మనమిహా గదిలో చేరి, ఎవరూ లేకుండా చూసి, కావల్సిన నంబరు తిప్పి, గుసగుస లాడుతున్నాము; మనకు తెలియకుండానే మధ్యలో ఎవరో దూరి, మనం మాట్లాడే ప్రతి మాటనూ అక్షరం పొల్లు పోకుండా విని ఆనందిస్తున్నారు. టెలిఫోన్ వాడే ప్రతి ఒక్కరికీ రోజులో ఏదో ఒక సమయంలో ఈ ఆనందం లభిస్తున్నది. ఇతరులు మాట్లాడే మాటలు వింటూ వుంటే ఎంత సంతోషంగా వుంటుందో, మనం మాట్లాడేది మనకు తెలియకుండా మరొకరు వింటున్నారని తెలిస్తే అంత కంపరంగానూ వుంటుంది.

మొన్నొక రోజు ఫోన్ ఎత్తితే టీనేజి తన ప్రియుడికి రహస్య వర్తమానం అందజేస్తుందింది — 'ఆయన' ఫలానా టైములో వుండరు కాబట్టి ఇంటికి వచ్చేయిమని; టెలిఫోన్లో తమ మాటలు ఎవరికీ వినబడవనే ధైర్యంతో వారిద్దరూ చేస్తుంటిని అసరస సల్లాపాలు అక్షరం పొల్లు పోకుండా మూడవ వ్యక్తి వింటున్నారని తెలిస్తే వారి ముఖాలలో మారే రంగులు కనిపెట్టడం ఏ చిత్రకారుడి తరం? ఇంకొక సారి ఇద్దరు మార్వాడీలు తమ స్మగ్లింగ్ గురించి స్వేచ్ఛగా మాట్లాడేస్తున్నారు. ఆ ఫోన్ ఏ పోలీసు చెవికో చేరివుంటే?

అవి వ్యక్తిగత రహస్యాలు కాని వ్యాపార రహస్యాలు కాని, రాజకీయమర్మాలు కాని, తీగల ద్వారా లోకానికంతా ప్రసారమై పోతే భరించేదెట్లా? వీటితో ఇంకొక పెద్ద బాధ ఏమిటంటే, అవతలి వారి సంభాషణ పూర్తయి, ఫోన్ పెట్టేసేంత వరకు మన ఫోన్ పని చేయదు. ఎస్‌టిడి కాల్స్ మాట్లాడే సమయంలో ఒక్కొక్కసారి ఈ క్రాస్ కనెక్షన్స్ వల్ల నిముషాల తరబడి వృధా అయిపోతున్నది. మనం ఎంత మొత్తుకున్నా అవతలి వారికి అర్థం కాదు. ఫోన్ పెట్టేయమంటే పెట్టరు; వారు దయ తల్చినంతవరకు మీటరు నంబర్లు గిర్రున తిరుగుతూనే వుంటాయి; నెలాఖరులో బిల్లు చూస్తే మన తల అంతకు రెండు రెట్లు స్పీడుగా తిరుగుతుంది.

ఎక్ఛేంజిలో యంత్ర పరికరాల లోపం వల్ల ఈ న్యూసెన్స్ ఏర్పడుతున్నదని అధికారుల ఉవాచ. నెల్లూరు ఎక్ఛేంజి పరికరాలు ఓబాయ కాలం నాటివి. చిన్న చిన్న పట్టణాలు, నగరాలు కూడా ఎలక్ట్రానిక్ ఎక్ఛేంజిలు పెట్టుకొని హాయిగా వుంటే, నెల్లూరీయులకు మాత్రం తుప్పు పట్టిన క్రాస్ బార్ పరికరాలే గతిగా వున్నాయి. పైగా ఇటీవలి కాలంలో నెల్లూరులో కాల్స్ సంఖ్య అనూహితంగా పెరిగి పోయిందట. ఈ ట్రాఫిక్ రద్దీకి ఆ పాత పరికరాలు తట్టుకో లేక పోతున్నాయి. బిజీ టైంలో ఒక ఫోన్ నుంచి వేరొక ఫోనకు దానంతటదే కనెక్షన్ ఏర్పడి పోతున్నదట. టెక్నికల్ సిబ్బంది ఎంత తంటాలు పడినా దండగే అవుతున్నదని అధికారులు చెప్తున్నారు.

నెల్లూరు నుంచి ఢిల్లీ దాకా పలుకుబడి కల్గిన నాయకులు మనకు దండిగా వున్నారు; వారొక్కొక్కరు పదవుల నిచ్చెనలు ఎక్కుతూ, విలాసాల ననుభవిస్తూ వుంటే మనం నోళ్లో వేలేసుకుని చూస్తున్నాం. ఓట్ల సమయంలో తప్ప వారికి జనం సమస్యలు జ్ఞప్తికి రావు; ఆ గంటా గడిచాక వారిని అడగడానికి జనానికి మొగమాటం. ఈ దౌర్భాగ్యం మనల్ని వీడనంత కాలం టెలిఫోన్లు మైక్రోఫోన్లవుతాయి— ఇంకా మాట్లాడితే ఆలిండియా రేడియోప్రసార కేంద్రాలు గానూ మారుతాయి. భరించక తప్పదు!

## పినాకినీ తీరం

(2 పేజీ తరవ)

అందువల్ల ఆనాడు చెప్పిన మాట ఏమైంది అని అడగడం అనుచితం కాదనుకుంటాను. నువ్వెవరు అడగడానికి అని అనరు గదా!

అందరూ అడిగేది ఒక్క దిన పత్రిక విలేఖరిని పిల్చి జాబితా చేతికిచ్చి ప్రకటింప జేసుకోవలసిన అవసరం ఏమి వచ్చింది? అందులో రహస్యం ఏముంది? రైట్ రాయల్‌గా అన్ని పత్రికలకు అధికార యుతంగానే పంపి అందరూ చదువుకొని సంతోషించే అవకాశం కల్గించి వుండవచ్చు గదా? సంజీవరెడ్డి గారు చిదంబరం విద్యార్థి. ఆ జాబితాను అధికార యుతమైనది కాదని చెప్పడంలోని చిదంబర రహస్యం ఏమిటో ఆయనకు తెలియ వలసి వుందే గాని, బయట వారి కెట్లా తెలుస్తుంది?

జిల్లా కాంగ్రెస్ కార్యవర్గం అంటూ ఒకటి ఏర్పడడమే గాని, ఇటీవలి దశాబ్దాల్లో ఒక్కసారి కూడా సమావేశమైన పాపాన పోలేదు. పేరుకు కార్యవర్గం; దాని అధికారాలు, కార్యకలాపాలు, ఆఫీసు అన్నీ అధ్యక్షుని జేబులో వుండడం రివాజు. అది అలంకార ప్రాయమైందే గాని, విలువ వుండేది కాదు. దాన్ని గూర్చి అందులోని పెద్దను గూర్చి గుచ్చి గుచ్చి అడగవలసిన అవసరం లేదు. కాని కొందరు కాంగ్రెస్ వాదుల నుండే కొన్ని విమర్శలు, ఆక్షేపణలు, ఆరోపణలు వినబడ్డాయి. దాపరికం లేకుండా చెప్పాలంటే ఒక తెలుగుదేశీయునికి డబ్బు తీసుకొని పదవి ఇచ్చారనే ఆరోపణ వచ్చింది. ఈ బ్రహ్మాండమైన పదవికి డబ్బు ఇచ్చేవారెవరు, ఆ నాలుగు కాసులకు కక్కుర్తి పడేవారెవరు? - నమ్మశక్యం గాని నింద. ఆ నామినే వాస్తే కార్యవర్గం పెద్ద మెలికలు లేకుండా ప్రకటించి వుంటే ఇటువంటి ప్రచారాలకు అవకాశం వుండేది కాదు. అసలు దొంగలు దొంగలు వూళ్లు పంచుకున్నట్లు కొందరు వ్యక్తుల కోటాలుగా కార్యవర్గాన్ని ఏర్పాటు చేయడమేమిటి? ఆ పంపకంలో కొందరిని మినహాయిం చడమేమిటి? సంజీవ రెడ్డి స్థాయికి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షతనేది చిన్న పదవి. ఆయన వల్ల ఆ పదవి పెద్దదైంది. అటువంటి పదవికి ఆయన ఆశ పడడమే వివాదాస్పదమైంది. దానికి తోడు ఈ కార్యవర్గ నిర్మాణం ఆయన వ్యక్తిత్వాన్ని దెబ్బతీసింది. స్వతంత్రతను, వ్యక్తిత్వాన్ని చూపించ దానికి అవకాశం లేక పోవడం వల్ల ఈ విధంగా జరిగిందను కోవాలి. పెద్ద త్యాగమే!

పదవులకు అర్హులైన వ్యక్తులను నియమిస్తే రాణింపు; వ్యక్తుల వల్ల పదవికి విలువ పెరగాలిగాని, వున్న విలువ పల్చ బడగూడదు. ఈ కార్యవర్గంలో జరిగిందదే. సీనియర్లంతా 'ఉప'లయ్యారు; పెద్దలంతా స్వయం ప్రకాశం లేని వుపగ్రహాల పాల్బడ్డారు. 'స్వారస్యపుతారు' తో పనిజేసే వారి చేతిలో పదవులెంత చక్కగా వుంటాయో వూహించుకోవచ్చు. అభిమానం వుంటే ఇతర విధాలుగా పంచిపెట్టవచ్చుగాని, రాజకీయాలలో చొప్పిస్తే పెద్దవారికి చెడ్డపేరు. ఇటువంటి వన్నీ తెలియక చేసే పనులు కాదు. తెలిసి చేసే వారి విషయంలో విమర్శలన్నీ చెవిటి వాని ముందు శంఖూదడమే అవుతుంది! ఏదో వుబుసుపోక వ్రాయడమే గాని, ఆ కార్యవర్గానికి ఇంత చోటు వినియోగించడం వ్యర్థమే!


ట్రంకురోడ్డులో మోడరన్ స్టోర్స్ నూతన షోరూం ప్రారంభిస్తున్న ఎమ్పీ మాగుంట సుబ్బరామిరెడ్డి; ప్రక్కన యాజమాన్య సోదరద్వయం, రఘు, నరసింహారావు

## రక్షణ

(9 పేజీ తరవ)

చేయించను పథకం రచిస్తారు. దీన్ని ప్రతిఘటించను ప్రయత్నించిన ప్రజలను హతగొట్టి, ఆప్రదేశాన్నంతా ధ్వంసం చేస్తాడు జిన్నా. ఈ దురంతాలను ఫోటోలు తీసిన జర్నలిస్ట్ ఏ.సి.పి బోస్ కు తెలియజేస్తాడని అతడ్ని అంతమొందిస్తాడు జిన్నా. జర్నలిస్ట్ హత్య తో శివమెత్తిన బోస్ హత్య జరిగిన సమయం లో ఫోటోగ్రాఫర్ తీసిన ఫోటో సహాయంతో జిన్నా కోసం ప్రళయకాళ రుద్రుడి లా బయలుదేరి పోయి అతన్ని అరెస్ట్ చేసి కోర్టు లో యావజ్జీవ శిక్ష పడేలా చేస్తాడు. తన తమ్ముడిని విడిపించమని రాజకీయనాయకుల కాళ్ళా వేళ్ళ పడి విఫలమైన నల్ల శ్రీను రాజకీయాల్లో చేరి అధికార పార్టీ రాష్ట్ర శాఖ అధ్యక్షుడి స్థాయికి ఎదుగుతాడు.

చిననాటి మిత్రుడు శివరామ్ (నాజర్) చెల్లెలు పద్మ(శోభన) ను పెళ్ళి చేసుకొని ఒక బిడ్డకు తండ్రి కావడం తో పాటు ఎస్.పి గా పదోన్నతి పొందుతాడు బోస్. పార్టీ అధ్యక్షుడు నల్ల శ్రీను అనుయాయులు నడి వీధి లో పెట్టిన మీటింగ్ వల్ల ప్రజలు ఇక్కట్లు పడి, ఒక పాప ప్రాణం కోల్పోవడం స్వయంగా చూసిన ఎస్.పి బోస్ వేదికను ధ్వంసం చేయడం విన్న శ్రీను చిర్రెత్తి పోతాడు. గెస్ట్ హవుస్ లో పోలీసు యూనిఫారంను అవమానించే శీను ను బూట్ కాలితో తన్ని బుద్ధి చెపుతాడు బోసు. తీవ్రంగా పరిగణించిన శ్రీను బోస్ ను తన పలుకుబడి వుపయోగించి తన స్వంత ఊరుకి ట్రాన్స్‌ఫర్ చేయించి మానసికంగా హింసించను రంగం సిద్ధం చేస్తాడు. దానిలో భాగం గా నక్సలైట్లు కిడ్నాప్ చేశారంటూ అసమ్మతి వర్గం ఎమ్మెల్యేలను దాచిపెడతాడు శ్రీను. ముల్లును ముల్లు తోనే తీయాలన్నబోస్. జిన్నాను పోలీసుల చేత కిడ్నాప్ చేయిస్తాడు. శ్రీను అనుకూలుడైన బోస్ పై అధికారి వల్ల పథకం విఫలమై ఇన్స్‌పెక్టర్ శివరామ్ అన్యాయంగా ప్రాణాలు కోల్పోతాడు. బోస్ కు ఈ విషయం లో ప్రమేయముందంటూ విచారణ కమిటీ అతడిని సస్పెండ్ చేస్తుంది. ఇదే అదనుగా భావించి బోస్ ను పట్టి బంధించి కసితీరా కొట్టి కొన ఊపిరి తో వున్న అతడిని అడవి లో పారవేస్తాడు జిన్నా. దారిన పోయే యాత్రికుల కరుణా హృదయం తో హాస్పిటల్ చేర్చబడ్డ బోస్ కోలుకొని జిన్నా, శ్రీనులకు తగిన బుద్ధి చెప్పడం తో చిత్రం ముగుస్తుంది.

వెంకటేష్ అక్కినేని, దర్శకుడు నారాయణరావురాసిన కథలో పెద్ద పస లేకపోయినా వారే రాసిన పటిష్టమైన స్క్రీన్ ప్లే వల్ల ఎక్కడా విసుగనిపించదు. అదే విధంగా సి. కృష్ణమూర్తి మాటసంగీత దర్శకత్వం వహించిన కీరవాణి ఒక పాట రాసి రెండు పాటలు పాడారు. వీటిలో స్లో సాంగ్, 'ఏ జన్మ దో ఈ సంబంధం, గుప్పు గుప్పు మన్నదంట' పాటలు వినసొంపుగా వున్నాయి. పాటల్లో భారీ ఎత్తున సెట్టింగులు ప్రేక్షకులను ఆకర్షిస్తాయి. స్మిత పై చిత్రీకరించిన మాల్గుడి శుభ పాడిన 'నీకూ- నాకు' పాటలో 'స్మిత' ఎక్స్‌పోజింగ్ దృశ్యాలు శృతి మించాయి. తేజ కెమెరాను ప్రశంసించకుండా వుండలేము. నైట్ ఎఫెక్ట్ సీన్లు, పాటల్లో ప్రతిభ అద్వితీయం. ఇప్పటి వరకు నాగార్జున చేయలేనంత స్పీడు గా డాన్స్ చేయించి నృత్య దర్శకుడు ప్రభు అతనిలో దాగివున్న నృత్య ప్రతిభను వెలికి తీసారు. హార్స్ మెన్ బాబు ఫైట్లు పాత మూస లోనే కొనసాగినా అక్కడక్కడా ఒకింత స్పీడుగా వున్నాయి. నటుల్లో హీరో నాగార్జునదే అగ్రతాంబూలం. ప్రతి సీన్‌లోనూ కష్టపడిన వైనం స్పష్టపడింది. తరువాత స్థానం మానసిక రుగ్మత గల విలన్ గా నటించిన సలీంగౌస్ ది. కరుడు కట్టిన కాఠిన్యం, అర్ధంకాని మనస్తత్వానికి అద్దం పట్టింది ఆ పాత్ర. హేర్ మేకప్ బాగోలేకపోయినా నల్ల శ్రీను గా కోట శ్రీనివాసరావు అదో టైపు విలనీయం బాగుంది. హీరోయిన్ శోభన భార్య పాత్ర లో రాణించక పోయినా బ్రేక్ డాన్స్ లు మాత్రం బాగా చేసింది. అతిథి పాత్ర లో రోజా తళుక్కుమనిపించి మాయమయ్యింది. బ్రహ్మానందంను రూట్ మార్చిన పాత్ర లో చూపించారు. నాజర్ తన పాత్రకు న్యాయం చేశారు. మరి యత్నం లో చూడ చక్కని చిత్రం తీసిన దర్శకుడు ఉప్పలపాటి నారాయణరావు అభినందనీయుడు.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ తరవ

### రంధ్రాన్వేషి

-హాలికుడు

#### ఆహార రేషనింగు

మదరాసులో జనానికి తల ఒకటికి 3 అళాకుల బియ్యం ప్రభుత్వం నిర్ణయించింది. దానధర్మాలు - అతిథి అభాగ్యతుల ఆదరం వర్తక సరళికి వచ్చిన ధరలకు యిది విపరీతంగా తోచక పోవచ్చును. కాని మనం అన్నందినేటప్పుడు 'అమ్మా' అంటే లేదనరాదే. ఇక తండోపతండాలుగా వీధులు తిరుగాడే భిక్షగాంగ్ర - ముష్టి కవళాల సంగతి ఏమి కావాలి? దిక్కులేని వాళ్లను పోషించడం విదేశాలలో ప్రభుత్వ బాధ్యత. యిక్కడ సంఘాన్ని వేచుక తింటారు. ఇంగ్లండులో ప్రభుత్వం పని చూపించలేకుంటే 'డోల్సు' అని దినానికి మనిషికి 21/2 షిల్లింగు (షుమారు రూ. 2/-) ఇచ్చి కూర్చుండబెట్టి మేపుతున్నది. యిక్కడ భిక్షం పెట్టకపోతే పోయింది కుక్కనన్నా కట్టి పోస్తే మెరుగు.

కాబట్టి 3 అళాకుల అలెవన్సు చాలదు అని పట్నం వారి గోల!

దొరల పురాణాలలో బకాసురుల్లు - వృకోదరుల్లు - వున్నట్లు లేరు - వుంటే అన్నం కొలత తమ జెయిళ్లలో మాదిరి నిర్ణయిస్తారా?



ఆడామగా పిల్ల, పెద్ద అన్న తేడా లేకుండా శీనయ్య అంతిమ దర్శనం కోసం బారులు తీరిన అశేష జన సందోహం!

# శ్రీనివాసులు రెడ్డి ఇక కనపడడు, వినబడడు!

2 పేజీ తరువాయి

అధ్యక్షుడుగా వుండిన శీనయ్య అన్న శ్రీ చంద్రశేఖర రెడ్డి జిల్లా పరిషత్తు అధ్యక్షులయ్యారు. ఆ స్థానంలో 1962 మే 14 తేది శ్రీనివాసులురెడ్డి అధ్యక్షతను స్వీకరించారు. చదువు పూర్తి కావడానికి – సమితి అధ్యక్షతను చేపట్టడానికి మధ్యలో వ్యవధే లేదు. జీవితంలో ఎత్తుకొంటూనే పదవి మాధుర్యం తప్ప, ప్రజా సేవలోని చేదు అనుభవం కించిత్ కూడా లేదు. తర్వాత తర్వాత శ్రీనివాసులు రెడ్డిలో పెరిగిపోయిన పదవి వ్యామోహానికి మూలం తేలిగ్గా లభించిన ఆ కోట సమితి అధ్యక్షతేనని నా అభిప్రాయం.

శ్రీనివాసులురెడ్డిలో సేవాభి నివేశం, నాయకత్వ లక్షణాం అది నుంచి తొంగిచూస్తున్నాయి. ఆంధ్ర విశ్వవిద్యాలయం లా కాలేజ్ స్టూడెంట్సు యూనియన్ కార్యదర్శిగా ఆయన వ్యవహరిస్తూ, సంఘం పావనిర్‌కు అవసరమైన నాయకుల బ్లాకుల కోసం 'జమీన్‌రైతు' కు వ్రాయగా మేము పంపడం జరిగింది.

సమితి అధ్యక్షుడుగానే శ్రీనివాసులురెడ్డి ఎంత పరిపాలనా సమర్థుడో, ప్రజాసమస్యల పట్ల ఎంత శ్రద్ధాసక్తులతో పనిచేసే వాడో వెల్లడైంది. అప్పుడు అతనికి సమితిలోని ప్రతి గ్రామం అవసరాలు, సమస్యలు కరతలా మలకంగా వుండేవి. ప్రతి గ్రామం, గ్రామంలోని ప్రతి వ్యక్తి అతనికి పరిచయస్తులుగా వుండేవారు. రోడ్లు, స్కూళ్లు, టెలిఫోన్లు, నీటి పారుదల వసతులు, మంచి నీటి సౌకర్యం ప్రతి గ్రామంలో కొరత లేకుండా జేయడానికి అహరహం కృషి చేసేవాడు. అప్పుడు జిల్లాలో 25 సమితులు కాబోలు వుంటే వాటన్నింటికి కోట సమితి మార్గదర్శకమని, అధ్యక్షుడు శ్రీనివాసులు రెడ్డి ఆదర్శప్రాయుడని ఆనాటి జిల్లా కలెక్టరు ఎం.ఎ. రాజగోపాల్ శ్రీనివాసులు రెడ్డికి ఒక ప్రశంసాపత్రం ఇచ్చారు. అది ఈ పుటలోనే ప్రత్యేకంగా యిస్తున్నాము. అప్పుడు నెల్లూరు జిల్లా అంటే సూళ్లూరుపేట నుండి దర్శి వరకు 13 తాలూకాలతో కూడి వుండేది. అతను జరిపిన సమితి మేళా మహోత్సవాలు ఎంత భారీగా జనాకర్షణీయంగా వుండేవో చూచిన వారికే తెలుస్తుంది. శ్రీనివాసులు రెడ్డి తొలి అధికార జీవితం అంత జనరంజకంగా ప్రారంభమైన దన్నమాట!



తెలుగుదేశం రెవిన్యూ మంత్రిగా కావలి పారిశుధ్య పని వారల సమ్మె సందర్భంగా చీపురు చేబూనిన శీనయ్య

శ్రీనివాసులు రెడ్డి స్వభావాన్ని ప్రస్ఫుటంచేసే ఒక సంఘటన జిల్లా రాజకీయాల్లో జరిగింది. నల్లపరెడ్డి వారు ఆనం వారి అంతే వానులు. చంద్రశేఖర రెడ్డి జిల్లా పరిషత్తు వైస్ ఛైర్మన్‌గా గాని, ఛైర్మన్‌గా గాని అయింది శ్రీ ఆనం సంజీవరెడ్డి పట్టుదల వల్లనే. ఆనాడు జిల్లాకు సంబంధించి సంజీవ రెడ్డి ఎదురులేని నాయకుడు. జిల్లా పరిషత్తుకు కూడా అంతే. ఆ "బానిస బ్రతుకు" మరీ దుర్భరమై పోయి కాబోలు చంద్రశేఖర రెడ్డి హఠాత్తుగా 1965 డిసెంబరులో తిరుగుబాటు బావుటా ఎగురవేశాడు - ముఖ్యమంత్రి బ్రహ్మానంద రెడ్డి గారి ప్రోత్సాహంతో ఎన్.సి. తో బాటు జిల్లాలోని ఆనం వర్గ అతిరథులు మహారథులనుకునే వారందరూ తిరుగుబాటులో చేరారు. ఆనం వారితో అప్పటి వరకు వుండిన స్నేహ సౌహార్ద్ర బంధాన్ని శ్రీనివాసులు రెడ్డి ఒక్కసారి తుడిచి వేసుకున్నట్లున్నారు. అన్న పక్షంగా జరిగిన సభలలో ఎ.సి., సంజీవ రెడ్డి గార్ల మీద ఒక్కసారిగా ధ్వజమెత్తడానికి, వ్యక్తిగతంగా దూషించడానికి ఎంత మాత్రం వెనుకాడలేదు. శ్రీనివాసులు రెడ్డి రాపూరు తాలూకా తోపుగుంట వగైరా సభల్లో చేసిన ప్రసంగాలు ఆ రోజుల్లో సంచలనాత్మకంగా వుండినాయి. తర్వాత తర్వాత ఆయన వాకాడు విషయంలో అవలంబించిన తీవ్ర వైఖరికి శ్రీనివాసులు రెడ్డి సహజ స్వభావమే కారణమని చెప్పడానికే పై సంఘటన వుదహరించ వలసి వచ్చింది.

శ్రీనివాసులు రెడ్డికి ఐదేళ్లకే సమితి చిన్నదై పోయింది. అతని దృష్టి జిల్లాకు పరిమితమైన ఏ పదవి మీదా లేదు. ఒక్కసారిగా రాష్ట్రరాజకీయాలకు ఎగరాలనే వాంఛ కలిగింది. గూడూరు కాంగ్రెస్ అభ్యర్థిత్వానికి దరఖాస్తు చేశాడు. అది సిద్ధయ్య నాయుడు గారికి లభించింది. తిరుగు బాటు చేయాలనే సంకల్పం కలిగి, అందరి ఒత్తిడితో ఎట్లనో విరమించుకొన్నాడు. కాని 1972 ఎన్నికలు వచ్చేసరికి అతనిలో సహనం లేకుండా పోయింది. పి.వి. ముఖ్యమంత్రి; కాంగ్రెస్ టికెట్ శ్రీమతి శారదాంబకు రాగా, తిరుగు బాటు అభ్యర్థిగా శ్రీనివాసులు రెడ్డి పోటీ చేశారు; గెలిచారు; ప్రప్రథమంగా శాసనసభలో ప్రవేశించారు. అతని రాజకీయ జీవితంలోను, జనార్దన రెడ్డి రాజకీయ జీవితంలోను, కోట – వాకాడు సంబంధాలలోను, దాని ప్రభావం రాష్ట్ర రాజకీయాల మీద పడడంలోను. ఎన్నిక పెద్ద మలుపు స్వతహాగా పెద్ద పెద్ద ఆశలు ఆకాంక్షలు గల వ్యక్తి శ్రీనివాసులు రెడ్డి; తన అభిలాషకు, తన అభిమతానికి, తన మార్గానికి అడ్డు అనుకున్న వారినెవరి

## పాతజ్ఞాపకాలు

ఇ

కైనా, ఎంతటి వారినైనా ఎదిరించి, తెగ్గి తెగడి విరోధం కొని తెచ్చుకొనే నైజం గల వాడు శ్రీనివాసులు రెడ్డి. రాజకీయాలలో అవకాశవాది అనే అపవాదుకు గురి కావడానికి, కష్టనష్టాల ననుభవించడానికి, ఒడిదుడుకులతో మనశ్శాంతికి దూరం కావడానికి ఆయన స్వభావమే కారణం. కాని వాటన్నిటినీ ఎదుర్కొని నిలబడ గలిగిన ధీరత్వం అతనిలో చివరి వరకు వుండినది.

1978 ఎన్నికలొచ్చే సరికి శ్రీనివాసులు రెడ్డి మారి పొయ్యారు. చివేకి కాబట్టి కొత్తగా ఏర్పడిన ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థిత్వానికి ప్రయత్నించారు; గూడూరు రిజర్వుడు కాబట్టి వెంకటగిరి సీటు వచ్చింది; విజయు లయ్యారు.

కొరవ 7 పేజీలో

## అనురాగస్మృతిలో...



## శ్రీమతి కలికి సరస్వతమ్మ

స్వర్గీయ కలికి కోటారెడ్డి గారి ధర్మపత్ని

జీవించి అందరి అభివృద్ధికి చేయూతనిచ్చిన అమృతమూర్తి మరణించి తన నయనాలను దానమిచ్చిన కరుణామయి, మమతా మూర్తి, మా అమ్మ మమ్మల్ని వీడి 18.2.93 తేదిన దైవ సన్నిధికి చేరింది.

**ఉత్తరక్రియలు** :4.3.1993 న నెల్లూరులో జరుగును.

అశ్రునయనాలతో అంజలి ఘటిస్తూ

| | |
|---|---|
| కలికి సుధాకరరెడ్డి | చెన్నారెడ్డి శేషారెడ్డి |
| శ్రీలత | విజయలక్ష్మి |
| నిత్య | వినయ్ |
| నవ్య | విపుల |



చింతలపల్లి వెంకట రెడ్డి గారి సతీమణి

**చింతలపల్లి అన్నపూర్ణమ్మ గారు**

జననం: 16.9.1916 నిర్యాణం: 29.2.92

3.5.106. నారాయణగూడా
హైదరాబాదు - 500 029.
ఫోన్: 45789

# దివ్యస్మృతి

సర్వావస్థలలోను మా జీవితాలలో అమృత వాత్సల్యం పంచి పెట్టిన మమతా మూర్తి, నవనీత సమాన దయార్ద్ర హృదయ, మము వీడి దైవ సన్నిధి చేరిన

మా అమ్మకు

భక్తిపూర్వక శ్రద్ధాంజలి

లీలామోహన్ చంద్రారెడ్డి
మాలిని, అనుపమ

రామ్ మోహన్
కుసుమ, దివ్య, దీప

శ్యామ్‌మోహన్
ఇందిర, నరేంద్ర, ప్రశాంత్

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.